# ఋణానంద లహరి

అను అప్పుకవీయము
మరియు
ఋణాహా శతభీ కఋణాపయోనిధీ
పద్యాములు
సన్మాన భంగం - కథ

ముళ్ళపూడి
వెంకట రమణ






నవోదయ
పబ్లిషర్స్
విజయవాడ 2

'ఋణానందలహరి'
'ఋణదా శరధీ కరుణాపయోనిధీ'
ఆంధ్రసచిత్ర వారపత్రికనుండి,
'సన్మానభంగం'యువ పత్రికనుండి
పునర్ముద్రితము.

## ఋణదా ! శరధీ ! కఋణాపయోనిధీ !

ఎవ్వనిచే జనించు ఋణ
మెవ్వనిచే భ్రమియించు లోకమం
దెవ్వని బుద్ధియే ఋణద
మెవ్వడు నవ్వుచు నవ్వులిచ్చు దా
నివ్వగ జాలనం చనక
నివ్వగ జాలక, దిప్పనట్టి వా
డెవ్వడు—ఆ ఋణాత్ము, ఋణదేశ్వరు
నేను ఋణంబు వేడెదన్.

ఒక సూర్యుండు సమస్త జీవులకు
దా నొక్కొక్క డైగోచు న
ట్లొకటే రూక ధనమ్ముగా ఋణముగా
నొక్కొక్కచో శిక్షగా
నొకచో రక్షగ, లక్షగా తృణముగా
నొక్కొక్కలై దోచుగా
కొకటే సత్యము—ఓత్తిరూకసుడి!—
అప్పొప్పుల్ అపోహల్, భ్రమల్.

ఋణ ఋగ్వేదికి వాదికి
ఋణకారణ జన్మడైన ఋణఖాదికి దా -
ఋణబుద్ధికి ఋణసిద్ధికి
ఋణభ్రమాభ్రమరునకును ఋణికిన్ ఘృణికిన్

వ. ఋణతరుణ వందన సహస్రం బాచరించి, నా యొనర్పం బూనిన శతకప్రకారంబు ... ఒక్క నిముషం. ముందు నా మనవోఁటి వినండి. తరవాత అసలు విషయానికి రావచ్చు.

కబ్బము చేయుచుంటి నిది
కాగనె, యచ్చుకు బంపగానె, మా
సుబ్బయ డబ్బు పంపగనె—
సుబ్బయ తప్పక పంపులెమ్ము—నీ
డబ్బుల నిత్తుగాని, యొక డబ్బది—
ఈ యతివల్ల—నిమ్ము, లే
దబ్బ యనంగబోకు
ఋణదా! శరధీ! కఋణాపయోనిధీ!

అప్పులు చాల చేసితని యర్వాత
లేదనబోకు లోకమం
దప్పులు తప్పులు న్నెరుగనేరని
వా రెవరైన నుందురే!
'అప్పుల'స్వామి యా వరుణు; 'డప్పుల'
కుప్పలు మేఘవార్నిధుల్—
తప్పగునా ఋణంబు? ఋణదా!
శరధీ! కఋణాపయోనిధీ!

సాగరు 'డప్పు' చేసి ఋణసాగరు
డైనను నిచ్చు వాహినుల్
'నాగతి చూడవా! యనెడు
నాగటిచాలున కీవు; కావునన్
ఈగతి నప్పుచేసితిని ఇమ్మిక
నమ్మిక నప్పు, దాచినఁ
దాగని దానశీల ! ఋణదా !
శరధీ! కరుణాపయోనిధీ !

'నాకడ నప్పుచేయుటగునా'
యని నవ్వుకొనంగబోకు మీ
లోకమునందు పారు నదులన్నిట
వార్నిధి యప్పుబిల్చగా
నా కడలిన్నగస్త్యముని యక్కట!
పుక్కిటబట్టి నిల్పలే
దా? కరుణాసముద్ర! ఋణదా!
శరధీ! కరుణాపయోనిధీ !

పూవులనుండి తేటులును
పున్నమిచందురునుండి కల్వలున్
గోవులనుండి వత్సములు
కోమలి మోవిని యాని కామియున్—
తావుల తేనె, వెన్నెలను,

తీయని పాలు, సుధారసంబులన్
ఏవిధి నశ్రమంబుగ
గ్రహించెడి-నట్టుల నిప్పుడేను ని
తావున నప్పుగొందు ఋణాదా !
శరధీ! కఋణాపయోనిధీ!

(తమరు ఋణాదానం చేసే పర్యంతం బండికదలను. ఋణగుణధ్వని చప్పున చల్లారిపోతుంది. గాన వెంటనే వో దేవా! తామీవిషయం శాలోచించగలరు.)

# ఋణానందలహరి

ఋణకిరణాలతో లోకాన్ని జోకొడుతున్న చంద్రుడు, అఋణకిరణుడు కనుచూపుమేరలో కానరాగానే తెల్లబోయి పాలిపోయాడు. రాత్రి తెల్లవారె, ప్లేటు తిరగేసి ఎర్రబార బోయింది. అప్పులు తీర్చేసినవాడి మనసులా లోకం ప్రశాంతంగా వుంది. గాలి చల్లగా మెల్లగా వీస్తోంది. ఉషాదేవి తనలో ఉండివుండి నవ్వుకొంటోంది. పువ్వులు మెల్లిగా మేలుకుంటున్నాయి. తొలిసారి వికసిస్తున్న మొగ్గలు పట్టు పగ్గాలు లేకుండా, మొదటిరోజున అక్కయ్య చీర కట్టుకున్న కన్నె పిల్లలా ఉన్నచోటునే పరవళ్ళు తొక్కుతున్నాయి. పక్షులు గుర్తుకొచ్చిన పాటలన్నీ పాడేస్తున్నాయి. కవులు నిరుత్సాహ పడకుండా. కాఫీపొడి అప్పు దొరికేదాకా ఆయనా, పిల్లలూ నిద్ర లేవకూడదని ఇల్లాళ్ళు ఆశపడుతున్నారు. అప్పులు ఇచ్చుకొన్నవాళ్ళు తెల్లవారుతోందని ఉప్పొంగి పోతున్నారు వీధుల్లోకి. తెచ్చుకున్నవాళ్ళు ఉప్పొంగి పోవడంలేదు గది అవతలికి.

యజమాని అడుగుల చప్పుడువిన్నా, రానీ చూదాం అని కూర్చున్న సేవకుడిలా మొత్తంమీద జగతి ఇంక

తటపటాయిస్తోంది. డ్యూటీలో పడదామా, కాస్సేపు ఆగుదామా అని సూర్యభగవానుడికి కోపం వచ్చింది. చాలా కాలం తరువాత రావలసిన డబ్బు చేతికి రాగానే, అప్పుల వాళ్ళ మొహాన విసిరి కొట్టేవాడిలా, ఆయన దూకుడుగా కిరణాలను గుప్పించేస్తున్నాడు. చిక్కటి మర్రిచెట్టుమీద కొమ్మ తొర్రె మధ్య కట్టిన గూట్లోకి ఓ కిరణం పడింది. అందున్న పిల్లకాకి మెల్లిగా ఓ కన్ను సగం తెరిచి చూచి, ఓహో తెల్లవారిం దనుకొని కావులించి, లేత రెక్కలు బద్ధకంగా విరుచుకుని నోరు తెరుచుకుని అలాగే పడుకుంది. నోట్లో యేమీ పడకపోయేసరికి ఆకలోయ్ అంది.

ఉష్ కాకి! ఏమిటా కావు కేకలు అప్పులాడిలా అంది తండ్రికాకి. పిల్ల కన్ను తెరిచి చూసింది. తల్లీ, తండ్రీ గూడుపక్కనే కొమ్మమీద కూర్చుని దేనికోసమో శ్రద్ధగా చూస్తున్నారు. మంచి పురుగులకోసం కాబోసు అనుకుంది పిల్ల.

అదుగో వచ్చేస్తున్నాయి, చూడు. అయిందా పెళ్ళి! నే చెప్పలే? అంది తల్లి కాకి.

అతను ఓరకంటనే కోరగా చూశాడు. పొద్దుటే పరగడుపుని ఆమాటెందుకు మళ్లీ? నువ్వా సీ అలంకారాలూను అని విసుక్కొని మళ్లీ కిందికి చూశాడు.

అతనిమాట, రెక్కలో బాణంలా గుచ్చుకుంది. ఆమె నొచ్చుకుంది.

* * *

చెట్టుక్రింద పెద్ద పుట్టదగ్గర చాలా సందడిగావుంది. మూడురోజులనాడు పుట్ట ఖాళీ అయినప్పటినుంచీ మళ్లీ ఎవ రొస్తారా ఎలాటి పాము దిగుతుందా అని కంగారు పడుతు న్నాయి కాకులు రెండూనూ.

క్రితంరోజు మధ్యాహ్నం ఓ డజను చీమలువచ్చి వెళ్లాయి. సంజవేళ కాకీ కాకీ బాకీగురించి తగవులాడు కుంటున్న అలికిడికి అయిచూస్తే, అయిదారువందల చీమలు కనిపించాయి. అవి పుట్టలోనికివెళ్ళి వాటాలూ, గాలి వాలూ, చెట్టునీడా, వానా వరదల తాకిడికి అవకాశాలూ చూసుకున్నాయి. ఇవతలికివచ్చి అన్నీ కూడబలుక్కు న్నాయి. వాటిలో డజను చీమల్ని మిగతావన్నీ గుచ్చి గుచ్చి అడుగుతున్నాయి.

వెర్రికుంకలు అనుకుంది ఆడకాకి ... తీరా ఇందాక తెల్లవారేసరికి చూస్తే సుమారు ఎనిమిది లక్షల చీమలు సంభారాలూ అన్నీ పట్టుకొని తరలి వచ్చేస్తున్నాయి.

*　　　*

కాకమ్మ విరగబడి నవ్వింది. చూడు చూడు. ఇంకా సేపటికి సుబ్బన్న, నాగలక్ష్మి వచ్చేస్తారు. ఇవన్నీ ఏం కానుటా అప్పుతూ ... పరిగెడతాయి పొలోమని, అంది.

అవెక్కడికొస్తాయిలే, ఆ పాములాడు ఈపాటికి నాగ మ్మను కూడా పట్టి బుట్టలో వేసుకుంటాడు.

కాదంది కాకమ్మ.

మాటలోనే దూరంగా సుబ్బన్నా, నాగలక్ష్మి కని పించారు. చరచరా వచ్చేస్తున్నారు – సరసాలు ఆడు కుంటూ, తుసా బుసా మంటూ.

మందారమొక్క దగ్గర నిలబడ్డ లేడిపిల్ల ఒకటి ఆలోచిస్తోంది —— ఈ ఆకులు బావుంటాయా అని.

కొంటె సుబ్బన్న పోతూ పోతూ అటు తిరిగి బుస్సు మన్నాడు. లేడిపిల్ల ఉలికిపడిచూసి నవ్వింది. కాని పరిగెత్త లేదు.

నాగలక్ష్మి హేళనగా నవ్వింది. చూశావా, తేడా తెలిసిపోతూంటేనే... అంటూ తనోసారి బుస్సుమంది. లేడి మందారాకుల రుచి సమస్య పరిష్కారం అర్జెంటుగా వాయిదావేసి వాళ్ళమ్మని పిలుస్తూ పరుగెత్తింది.

కోరలు పీకేశారు కామోసు పాపం సుబ్బన్నకి అంది కాకమ్మ జాలిగా అటే చూస్తూ.

కాకరాజు మాట్లాడలేదు. జరగబోయేకథ తల్చు కుంటే అతనికి గుండె గుభేలు మంటోంది.

ఉత్సాహంగా ఆడుతూ పాడుతూ సుబ్బన్న, నాగలక్ష్మి పుట్టదగ్గిరికి రానేవచ్చారు. వచ్చినవారల్లా కొండపల్లి బొమ్మపాముల్లా కొయ్యబారిపోయారు – తమ పుట్టకి పట్టినగతి చూడగానే.

పుట్ట గుమ్మాలనిండా, గోడలనిండా లక్షోపలక్షల చీమలు. చాలా హడావిడిగా సందడిగా తిరుగుతున్నాయి. ఐదారు పెద్ద చీమలు ఉత్తర్వులు వేస్తున్నాయి. పిల్లల్ని ఒక కంతలోంచి, బియ్యపుగింజల్ని ఇంకో గుమ్మంలోంచి పంపిస్తు

న్నాయి. మరో దారివెంట కొన్ని చీమలు పుట్ట మట్టిని పట్టుకెళ్తున్నాయి లోపల గదులు కట్టడానికి.

సుబ్బన్నకి కోపం వచ్చింది. ఏమిటీ అఘాయిత్యం! ఏమిటీ చోరవ. సరసం దారుణం. దోపిడీఅనుకొని పడగెత్తి బుస్సుమనబోయాడు.

స్. నువ్వొద్దు. నా మాట విను. పరువుపోతుంది అంటూ నాగలక్ష్మి పుట్టకేసి బుసకొట్టి తరువాత మాట తూలినందుకు మన్నించమంటూ మొగుడివంక చూసి నాలికలు కొరుక్కొని తల వంచుకుంది. చీమలన్నీ గజగజ లాడి ఎక్కడివక్కడ స్తంభించిపోయాయి. సింహద్వారం దగ్గిర ఒక చీమంతిచుట్టూ చేరి కులాసాగా కబుర్లు చెబు తున్న కుర్రకారంతా ఆ పిల్ల వేసిన ఒక జోక్‌కు చిమచిమ నవ్వబోయి మానేయకుండా సంభవమైంది.

సుబ్బన్నా, నాగలక్ష్మి పుట్టకి కొంచెం దగ్గరగాపాకి ఆగి పడగలెత్తి సర్పదర్పాన్ని అభినయించారు.

ఫోజు ఫొటోజెనిక్‌గానే ఉంది అన్నాడొక చీమంతుడు. చుట్టూ ఉన్నవాళ్ళంతా పగలబడి నవ్వారు.

బుస్సుమంది నాగలక్ష్మి.

ఉస్ తప్పని మందలించింది పెద్దచీమ. తరువాత ముందుకొచ్చి గుమ్మందగ్గిర గుట్టమీద నిలబడి ఎవరు మీరు ఏం కావాలి అంది ఠీవిగా.

చెప్పుకోండి చూదాం అంది నాగలక్ష్మి వెటకా రంగా

చీమ మందహాసం చేసింది.

అమ్మాయి...ఇలాటి పొడుపుకథలే కాదు నే నింకా చాలా చెప్పగలను ... అయినా నువ్వడిగింది చెబుతా. ఈ పుట్ట యింకా మీదే అనుకుంటున్నావుగాని కాదు. మీకూ దీనికీ ఋణానుబంధం తీరిపోయింది. మిగిలింది మీకూ మాకూను. అంచేత ఇకనించి ఇది మాది అంది.

పాములు పెట్టిన పుట్టలు చీమల కిరవైన యట్లు అన్నాడు సుబ్బన్న విచారంగా.

ఛఫ్...పాములు పెట్టిన కాదు చీమలు పెట్టిన... అంది నాగలక్ష్మి కోపంగా.

అచ్చు తప్పు పడివుంటుంది నువ్వు చదివిన పుస్తకంలో...పాములే రైటు. కారణంవల్ల కూడా ఇది మాదే. లేదా నువ్వన్నట్టు చీమలు పెట్టిన పుట్టలే అయినా కూడా ఇది మాదే. అంచేత ఏ విధంగా చూసినా—అంది చీమ.

బుస్‌మంది నాగలక్ష్మి. సుబ్బన్నకి కూడా తిక్క వేసుకొచ్చింది. ముందుకు దూకబోయాడు.

అట్టె అట్టె ఆగు—అంది పెద్దచీమ. నాయనా ఆడ దాని మాట విని తప్పుదారిన పడకు. నువ్వు పూర్వజన్మలో మాకు ఇంటద్దె బాకీ వుండి వుండవచ్చుగదా. అంచేత మేము ఈ ఇల్లు బేవార్సుగా తీసుకొన్నా తప్పులేదు... పాతబాకీ కాకపోయినా, నువ్వు ఐదారు జన్మల తరవాత

కోటికి పడగెత్తి పుట్టి, వేలకొద్దీ అద్దెకొంపలకు యజమాని కాగల ప్రమాదం వుంది ఈ చీమలన్నీ అప్పుడు అక్కడ అద్దెకి దిగవచ్చు. నువ్వు అయిదు రూపాయిల యింటికి పాతిక వసూలు చేయవచ్చు. అప్పుడు పడగల బాకీకి ఇప్పుడు అడ్వాన్సుగా ఈ ఇంటి రూపేణా జమకడితే, దేవుడికి మొక్కుబళ్ళు తప్పుతాయి గదా అప్పుడూ.

సుబ్బన్న సందేహంగా భార్యవంక చూశాడు. ఆమె పడగ ఆడించింది.

నాకీ జన్మలలోనూ గిన్మలమీదా నమ్మకంలేదు. అంతా ఉత్తి దొంగమాటలు నీవి... బాకీలేదు, కాకీలేదు అన్నాడు సుబ్బన్న ధైర్యంగా.

కావ్ కావ్ మంది చెట్టుమీద కాకి.

చూశావా. నువు కాకి లేదంటే ఉన్నానని పైనించి సాక్ష్యం... అలాగే బాకీకూడా ఉండేవుంటుంది అంది చీమ.

వాళ్ళ మాట నమ్మకు అని రెచ్చగొడుతోంది నాగలక్ష్మి.

సుబ్బన్న పడగెత్తి ఏగో అనబోయాడు.

*        *        *

పెద్దచీమ పక పక నవ్వింది

ఓయీ అమాయకుడా! నీ పక్కనున్న దానిమాటే నమ్మకు. అది ఎవరనుకుంటున్నావు ? నీభార్య అనా! పొర పాటు. ఆమె అసలు పేరు ఋణసుందరి. నూరేళ్ళక్రితం

నువ్వు ఋణదత్తుడి జన్మలో ఉన్నపుడు ఈవిడకి బాకీపడ్డావు. దాని తాలూకు బకాయి. ఈ జన్మలో వసూలు చేసుకుం టోంది. నిన్న నీకోరలు పీకించింది ఎందుకనుకున్నావు? అంది పెద్దచీమ.

సుబ్బన్న తెల్లబోయి నోరు వెళ్ళబెట్టాడు.

చెట్టుమీద కాకమ్మ ముందుకు వంగి తొంగిచూసి ఇందాక చెప్పింది నిజమే. సుబ్బన్నకి కోరలు పీకేశారు పాపం. అందుకే ఇందాక లేడి భయపడలేదు అంది.

మొగుడు మాటాడలేదు.

ఆడదానిమాట వినడంకూడా ప్రమాదమేనని అతనికి భయం పట్టుకుంది. సరిగ్గా మూడురోజులక్రితం సుబ్బన్న మాంచి పొగరె తిన కోడె తాచు. ఇవాళ ఉరిబోసితాచు. ఆరోజు అతనూ నాగలక్ష్మి చెట్టుకింద దోబుస లాడు కుంటూండగా ఓ పాములవాడు వచ్చాడు. నాగలక్ష్మి వాణ్ని చూడగానే గతుక్కుమంది. ఒక నిముషం తరవాత, మొగుడిని పిలిచి, వాడికి దొరికిపొమ్మంది.. వాడు పాపం బీదవాడట. సుబ్బన్న పట్టుబడితే తీసికెళ్ళి అమ్ముకుని నాలుగుడబ్బులు తెచ్చుకుంటాడట. వాడు అమ్మెయ్యగానే సుబ్బన్న, తనను కొన్నవాణ్ణి కరిచేసి పారిపోయి రావచ్చు. వెనక తనుకూడావచ్చి అక్కడివాళ్ళని కరిచి మొగుణ్ణి విడిపిస్తుంది. ఏ కళనున్నాడో సుబ్బన్న ఒప్పుకున్నాడు. పాములవాడికి మటుకు ఈ పథకం, నాగలక్ష్మి సదు ద్దేశం పూర్తిగా బోధపడలేదు. అందుకని సుబ్బన్న

దొరకగానే ముందరే కోరలు పీకేసి మరీ తీసుకెళ్ళారు. తర వాత నాగలక్ష్మి పొరపాటుకి నాలికలు కరుచుకుని, వాడి కూడాపోయి పట్నంలో సుబ్బన్నని వాడెవరికో అమ్మగానే వాళ్ళని కరిచేసి అతన్ని విడిపించుకు చక్కా తీసుకొచ్చింది. అయితేనేంటుకు ? సుబ్బన్న కోరలో ?

అవి వుంటే ఈ చీమలు ఇన్ని సొగసులు మాటాడ గలిగేవా ?

సుబ్బన్నకూడా ఆమాటే అనుకుంటున్నాడు దిగాలు పడిపోయి. చీమ ఓదార్చింది. ఫరవాలేదు ఋణదత్తుడా' విచారించకు. నీకూ నీ కోరలకీ ఋణం తీరిపోయింది. ఈ ఋణానుబంధాలు లోకంమీద అంతటా ఉన్నవే. నీ కింత చేటు తెచ్చింది చాలక ఇంకా తేవాలని చూస్తున్న నీ భార్య నాగలక్ష్మి అను ఋణగ్రసించవకి నువ్వెలా బాకీ పడ్డావో ఆ కథా కమామిషూ గుర్తుచెయ్యనా ? అంది.

సుబ్బన్న నాగలక్ష్మివేపు చూశాడు కథ విందామా అని. ఆమె ఏమీ అనలేదు.

చీమ నవ్వింది. వింటుందిలే భయపడకు. లేదా ఏనాడో ఓ గంటసేపు నాకు బలవంతాన నీ ఆత్మకథ ఏకరువుబెట్టి ఆ గంటా ఋణపడ్డానను కో అంది.

సుబ్బన్న సరే కానీ అన్నాడు.

మరయితే నువ్వలా పడగపైకెత్తి కూర్చుంటే ఎలా. బెణుకుతుంది. స్థిమితంగా కూర్చో. ఓ దత్తుడా ! ఈ కథను సావధానంగా వినవలసింది అంటూ కథ ఆరంభించింది చీమ.

## ఋణదత్తుని కథ

మీ ఆలుమగ లిద్దరికీ ఋణానుబంధం ఏర్పడ్డది నూరేళ్ళక్రితం. అప్పట్లో నీపేరు ఋణదత్తుడు. మీ తండ్రి ఋణబుద్ధిగారు, ఋణసిద్ధి అనే దుష్టుడికి డబ్బు బాకీపడి తీర్చలేక ఆలోగానే జన్మ ఫిరాయించవలసి రావడంవల్ల వ్యవధిలేక నిన్ను ఋణసిద్ధికి ఒప్పగించాడు.

నువ్వపుడు ఇరవైయేళ్ల చిన్నవాడివి. మంచి బలంగా ఏపుగా ఉండేవాడివి. ఋణసిద్ధిగారి అప్పు తీరే పర్యంతం నువ్వు ఆర్జించినదంతా ఆయనకి ఇచ్చుకుంటూ వచ్చేటట్టు ఏర్పాటు. ఆనాటినుండి నీకు ఋణదత్తుడు అని పేరు వచ్చినది. కాని నువ్వు అసాధ్యుడివి. అప్పులనేవి ఉండగా కష్టపడి సంపాదించడ మేమిటని నవ్వుకున్నావు. పైగా అప్పు తీర్చడానికి అప్పుడబ్బే ముఖ్యమని నీ నమ్మిక. అందువల్ల కుడి ఎడమైనా చిత్తం వచ్చినట్టు రెండుచేతులా అప్పు చేశావు. రద్దీనిబట్టి దగ్గరున్న వాళ్ల చేతులు అప్పుపుచ్చుకుని వాటితోకూడా అప్పుచేశావు.

అప్పు ఇవ్వగలవాడిని ఏరుకోవడంలో, ఏరుకున్న వాడిని ఎరవేసి పట్టుకోవడంలో, పట్టుకున్న వాడిని ఆకట్టుకోడంలో, ఆనక వాడిచేత అప్పు (అసలాపాటికి వాడివ్వబోయే అప్పు నీ దృష్టిలో వాడివ్వవలసిన బాకీగా తయారయిపోయి ఉంటుంది) కక్కించడంలో, అవి మళ్ళీ ఇవ్వకుండా చెల్లుపెట్టించడంలో నీకు నువ్వేసాటి అనిపించుకున్నావు నిన్ను చూపించి విశ్వామిత్రుడిని నక్షత్రకుడూ,

అతడిని ఇతడూ హేళన చేసుకునేవారు. బీద ఉపాధ్యాయులకూ, గుమాస్తాలకూ వారి వారి ఇల్లాళ్లు నిన్ను ఆదర్శంగా చూపించేవారు. ఋణదత్తుడు అప్పు అడగడంలో చూపే ప్రతిభలో సగమేనా నువ్వు కప్పాలూ, పన్నులూ, బాకీలూ వసూలు చేయడంలో చూపితే ఖజానా ఇంత బారుమని ఉండేదికాదు అంటూ మహామంత్రులు, ఇతర రాజోద్యోగులూ ఆయా వసూళ్ల ఉద్యోగులను చీవాట్లేసేవారు.

ఈ విధంగా నీ పేరు ముమ్మరంగా మోగిపోతున్న రోజుల్లో ఈ అమ్మాయి ఋణసుందరి నిన్ను గురించి వింది. ఆమె తండ్రి ఋణకేతుడు కొన్నాళ్లు ఉద్యోగంచేసి, ఇదేమిటని అప్పుచేసి బాగా డబ్బుగడించాడు. ఆయనకు ఋణసుందర్కి, కాక అఋణ, కఋణ అని మరిద్దరు పుత్రికలు. తన ఆస్తిని నిర్వాకంచేసి నిలబెట్టె ఋణదీపకుడు లేనందువలన, ఉన్న ముగ్గురు కూతుళ్ళలో ఋణసుందరి అనే చిన్నదాన్ని అధికారిణిగా ఎన్నిక చేసుకొని డబ్బుని ఎలా కాపాడుకోవాలో, దొంగలనుండీ అప్పులడిగేవారి బారినుండీ ఎలా తప్పించుకోవాలో, తప్పించుకొన్నట్లు నటించాలో ఆమెకు బాగా నూరి పోశాడు.

ఒకరోజున నువ్వు నీ మిత్రులతో కలసి కులాసాగా అప్పులగురించీ, ఇచ్చిపుచ్చుకోడాలలో ఒడుపుల గురించీ కబుర్లు చెపుతున్నావు. అంతా శ్రద్ధగా వింటున్నారు.

...అసలడిగేవాడి తేజంలో కొంత ఉంటుంది. ఏదీ మాటవరసకి చెబుతా మీారో వరహా ఇలా ఇవ్వండి చెబుతా ...మీారోటి ఇవ్వండి. శ్రేష్ఠిగారూ, తమరు ఒక హస్తం

దయచేయించండి. కొత్వాలిగారి అల్లుడా! నువ్వోజోడు మంజూరు చేయించు అంటూనే హడావుడిగా వాళ్లేం చేస్తున్నారో, వాళ్లకే తెలిసేలోగా రెండు పుంజీల వర హాలూ పుచ్చుకు రెండిన దోపుకుని కల్లబొల్లి కబుర్లు మరి నాలుగు చెప్పి, మీ వరహాలు మళ్లీ నాల్రోల్లో పంపిస్తానంటూ చక్కా పోయేవు.

నిన్నోమహాకంట కనిపెడుతున్న ఋణసుందరి చెలికత్తె ఋణతిలక అనేది హఠారా అని ముక్కున వేలేసుకుని నిన్ను పిలిచి, ఓ చిన్నవాడా మా ఋణసుందరి దగ్గిర అప్పు సంపాయించగలవూ? అంది.

అదెంత పని అనుకునీ ఆ మాటే అని, మర్నాడే నువ్వు ముస్తాబై జలతారు కండువా వేసుకుని హాయిలుగా ఋణకేతుడింటికి, ఆయన ఇంట లేనివేళ వెళ్లి అయ్యా! ఋణకేతుడుగారున్నారా? అన్నావు.

ఋణసుందరి సావిట్లో ఉయ్యాల ఊగుతోంది. లేరని నిజంగా మీకు తెలీదా అంది వెటకారంగా.

అమ్మా! అయినింటిపడుచు అనతగ్గ మాటలు కావివి అయినా అడిగావు కాబట్టి చెబుతున్నా, వారు లేరని ఖరారుచేసుకుందికి అడిగాను. అన్నావు నువ్వు వినయంగా.

ఎవరు మీరు ఏం కావాలి? అంది ఋణసుందరి నిర్లక్ష్యంగా.

నా పేరు ... ఋణదస్యుడు అన్నావు గంభీరంగా నిలచి కండువా సవరించుకుంటూ.

ఊయలలో చిన్నది తెల్లబోయింది. తా నిన్నాళ్లూ ఎదురు చూస్తున్న ఘనుడు ఎదట నిలచాడన్న తలపు రాగానే ఆమె చెంపలలో కెంపులు వెలిగాయి.

మీకేమైనా అప్పు కావాలండీ? అని తెగించి అడిగే టంత ప్రేమ, గౌరవం పెల్లుబికాయి ఆమెలో. సుశిక్షితు రాలు కాబట్టి అంతలోనే ఆ ఊహని నిభాయించుకుని కూర్చోండి అంది పీఠం చూపిస్తూ.

నువ్వుకూడా ఆ ముహూర్తాన అమితంగా కలవరపడి పోతున్నావు–ఇంత అందమైన చిన్నదాని గురించి ఎంత ఘోరమైన వదంతులూ అని. ఇంత చక్కనిదాని దగ్గర క్రూరంగా అప్పు తీసుకోవడమేనా అన్న భావంకూడా కలిగి చలించిపోయావు. కాని సుశిక్షితుడివి కాబట్టి ఆ ఊహను నిభాయించుకున్నావు.

కథ వింటున్న సుబ్బన్న, నాగలక్ష్మి ఈ మధుర ఘట్టాన్ని తలచుకుని ఒకరినొకరు ఓరకంట చూసుకున్నారు.

అదిగో ఆ చూపులే మీ యిద్దరినీ ఒకే క్షణంలో మోసగించాయి. ఆమె చూపులు నీ చూపులతో కలవ గానే నీ గుండె ఝల్లుమని, ఒళ్లు జలదరించి – సుందరీ అడగను. నిన్ను ఋణం అడగను – అనేశావు నువ్వు.

సరిగా ఆ ముహూర్తానికే చిరంజీవి సౌభాగ్యవతి ఋణసుందరికి కూడా అలాటి తలపే కలిగి అడగండి. మీ ఇష్టంవచ్చినంత ఋణం అడగండి ఇస్తాను అనేసింది.

అలోగానే నువ్వు నాలిక్కరచుకుని (అపుడు ఒక టే లే) పది వేలు చాలు అనేశావు.

ఆ పిల్లా అలాగే మనసు మార్చుకునేదే కాని, మాట జారిందాయె, చేసేదిలేక ఇచ్చేసింది. ఈ జన్మకి మీ ఋణం తీర్చుకోలేను అంటూ నువ్వు సగర్వంగా వెళ్లిపోయావు.

ఆ రోజున ఆమెని అప్పచెల్లెళ్లు ఈ అప్పుగురించి ఒక మాట అన్నారా... ఒక హేళన చేశారా... సాయంత్రానికి ఋణకేతుడు ఇంటికి వస్తూనే, జరిగిన ఓ ఘాయిత్యం విని నిలువునా కుప్పకూలిపోయాడు. కూడదీసుకు లేచాక, కూతుర్ని పునరుక్తిదోషం పట్టినా సరేనని కొద్దిపాటి ఘాటు మాటలతోనే తిట్టిపోశాడు.

సుందరి చిన్నబుచ్చుకుంది. మళ్ళీ ఆమె కోలుకో లేదు. అంతేకాదు ఎవరొచ్చి అడిగినా అడక్కపోయినా పనిమల్లె పిలిచి అప్పులిచ్చేసేది డబ్బు. అదిచూసి తండ్రి ఋణశాస్త్రజ్ఞులను పిలిచి చూపించాడు. ఇచ్చిన పెద్ద అప్పు మళ్ళీ రాబట్టించడమే మందన్నారు.

పుచ్చుకున్నవాడు ఋణదత్తుడు! మగోడూ మగోడూ కాడు. ఎలాగ? అని నిరాశపడ్డాడు తండ్రి.

చాలా ఆలోచించి చివరికి ఋణసుందరిని నీకిచ్చి పెళ్లి చేసేశారు. బతికున్నన్నాళ్లూ కూడా ఉంటావు కాబట్టి వసూలు చేసుకో అని. కాని ఆ జన్మలో అప్పులు తీర్చే ఉద్దేశమూ లేదు; శక్తీ లేదు నీకు. నీ దగ్గర ఉన్న దంతా అప్పు డబ్బే. ఆమెకు పనికిరాదు. నువ్వు సంపాయించగా చూసి వసూలు చేదామని కాచుకుని కాపరం చేసింది. అంతలోకీ ఆ జన్మ అయిపోయింది.

పక్క జన్మలో నువ్వు వడ్డీ వ్యాపారస్తుడివి. ఒకళ్ళకి అప్పులివ్వడమేతప్ప తీసుకోడం నీకు పనికాదాయె. మీ యింట నౌకరుగా పుట్టిన సుందరి ఆ జన్మంతా చూసి చూసి విసుగుచెందేవరకూ నువ్వు 'ఇల్లుమారి' గుర్రం అయ్యావు. ఈపిల్ల మళ్ళీ ఆడగుర్రమై పుట్టి నీతో జతగట్టి అప్పు వసూలు చేయబోయింది. ఒక వాయిదా కట్టావో లేదో నువ్వు తొడుక్కున్న గుర్రానికి గడ్డిపరకలు చెల్లాయి.

పొరుగు జన్మలోనో ఆ పక్కదాంట్లోనో ఈవిడ నీ కొడుకై పుట్టి, నానా క్షోభా పెట్టి చాలావరకు అప్పు వసూలు చేసింది. తరవాత ఓసారి నువ్వు గండభేరుండమై పుట్టావు. ఈవిడ నీ కడుపున పుట్టింది. నీ కోపంవచ్చి తిట్ట బోయావు. పిల్లకి కొంచెం భాష తెలిసేదాకా ఆగి తిడదా మనుకుంటున్నావు. అంతలోనే కాలాతీతం అయిపోయి 'ఇల్లు' మారిపోయావు. ఈసారి ఓ మంచివాడి కడుపునపడి కొంచెం పెరుగుతూనే అప్పు తీర్చి పారెయ్యాలనుకున్నావు. ఇంకా చాలా పథకాలు వేసుకున్నావు—ఆ జన్మలో తొడుక్కున్న శరీరానికి, దానికి పెట్టినపేరుకీ పేరూ గట్రా తెద్దామని. ఓరోజున దానికిదెబ్బతగిలింది. తరవాత దానిమూలానే శాల్తీ పాడైపోయింది... అనుకున్న పనులు ఆగిపోతాయని, దానికి ఎన్నో మరమ్మతులు చేయించావు. మాసికలు వేయించావు. ఆ జన్మలోనే ఈవిడకే చాలావరకు అప్పు తీర్చేశావు. ఇంకో పదివరహాలుండనగా ఈవిడ గల్లంతై పోయింది. ఇప్పుడు ఈ జన్మకి మీాకు నాగుపాములై పుట్టార

ఇదిగో ఆ మిగతా డబ్బుకోసం నీ పెళ్ళామె నానా అవస్థలూ పెడుతోంది.

మొన్న నిన్ను పట్టుకున్న పాములాడికి ఈవిడ ఆ మధ్య ఓ జన్మలో పది వరహాలు బాకీ. నువ్వేలాగా ఈవిడకి పదివ్వాలిగదా, అది నీద్వారా ఇప్పించేస్తే ఇటు తనకి నీ బాకీ, అటు వాడికి తన బాకీ కూడా ఒక్కసారే చెల్లిపోతాయని, ఎవరిదారిన వాళ్ళుపోయి కొత్తవారి దగ్గర అప్పులు చేసుకోవచ్చనీ ఊహపడి, నిన్ను వాడికి దొరికి పొమ్మంది. వాడు నిన్ను అమ్మి నాలుగుకాసులు చేసుకు పోవచ్చుగాని, తెలీక కోరలు పీకేశాడు పాపం. ఇపుడు...

కళ్ళు మూసుకుని కథఅంతా వింటూ మనసు సమాధాన పరచుకొంటున్న సుబ్బన్నకి అంతలోనే, — ఐ పి. పెడున్నవాడికితు ఆ క్రితంరోజే ఆ స్త్రీమీద అరవై వేలు అప్పిచ్చినవాణ్ణి చూసి తోటివాళ్ళు నవ్వుతున్నరకం అలికిడి వినబడి కళ్ళు తెరచి చూశాడు.

దాదాపు రెండులక్షలచీమలు పొట్టలు చెక్కలయేలా నవ్వుతున్నాయి. కొన్ని క్రిందపడి దొర్లుతున్నాయి. కొన్ని ఇందాకటినుంచి కథ చెపుతున్న పెద్ద చీమకి జోహార్లు చేస్తున్నాయి.

అద్భుతం మావయ్యా! ఇంత గొప్పవాడి వనుకోలే. ఈ జన్మలూ గిన్మలూ ఇవన్నీ ఎలా అల్లావయ్యా. ఈ కథ ఎలా కల్పించావయ్యా అంటున్నాయి కొన్ని చీమలు.

పెద్దచీమ వినమ్రత నటించి ఏదో గమ్మత్తు...ఏం చెప్పకపోతే ఈ పాములు ఈవరకు పుట్టని ధ్వంసంచేసేవి గదా అంటోంది.

చీములన్నీ పగలబడి నవ్వుతున్నాయి.

అయితే స్వామీ! ఈ జన్మల గొలుసుకథ ఎక్కడిది. లేనిపోని యీ కోతలు, అబద్ధాలూ చెప్పడం యెక్కడ నేర్చారూ... క్రితం జన్మలో మనిషిగా పుట్టారా ఏవిటి పుట్ట తీసి అందో ఆడచీమ.

అబద్ధాలకి మనిషే కావాలనేముంది?...మీఆడంగులు చాలరూ—అన్నాడామె మొగుడు ఎత్తిపొడుపుగా.

పెద్దచీమ తుళ్ళి తుళ్ళి నవ్వుకుంటూంది. జన్మట. పాత జన్మట. సి. సి. అంటూ.

సుబ్బన్నకీ నాగలక్ష్మికీ కూడా, జరిగినకథ క్షణంలో తెలిసిపోయింది.

ఒక్కసారిగా నాగలక్ష్మి తోకమీద లేచి బుస్సుమంది. పుట్టమీదచీములు కకావికలై పోయాయి. నాగలక్ష్మి పుట్టమీదికి విరుచుకు పడబోయింది. అంతలోకి సుబ్బన్న చుట్టూచూసి గతుక్కుమని నాగలక్ష్మిని ఆగమన్నాడు. నాగలక్ష్మి ఆగింది, ఆగి చుట్టూచూసింది.

పదిలక్షల కోట్లచీమలు, ఎప్పుడొచ్చాయో చడీ చప్పుడూ లేకుండా చీమల్లా వచ్చేసి పాముల్ని చుట్టు ముట్టడించి నిలబడి ఉన్నాయి గంభీరంగా. ఎటుచూసినా కనుచూపుమేరలో నేల కనబడటంలేదు.

ఝుమిటిది. ఝుమిటీ ఓఘూయిత్యాం. మిమల్నందరిని బూడిద చేసేస్తాను అన్నాడు సుబ్బన్న.

బలవంతమైన సర్పము చలిచీమలచేత జిక్కి అందో చీను తెలివిగా. సాటి చీమలన్నీ పగలబడి నవ్వాయి.

ఏడిశారు బోడితెలివి మీరూను...అసలు మీరు చలిచీమలుకారుగా అంది నాగలక్ష్మి వెటకారంగా.

చూస్తారా ఏమిటి తడాఖా. పద్యం రైటో కాదో ఇపుడే తేల్చేదాం అంది చిన్నచీమ దూకుడుగా.

పెద్దచీమ, దాన్ని మందలించి సుబ్బన్నని అనునయించింది. అయ్యా సుబ్బన్నగారూ సారస్వతగోష్ఠి మన సమస్యను పరిష్కరించదు. జరగాల్సింది చూదాం—ఇపుడు జరిగిందేదో జరిగింది. దిగినవాళ్ళం ఎలాగా దిగిపోయాం. ఇపుడు కదిలిపోవడం కష్టం; పోతే, మిమ్మల్ని ఓడించడం సులభం. ఇప్పటికే కొంత స్నేహితులమైనందువల్లా కంద పద్యాలలో ప్రాసాదికాలవంటి ఛందో బాంధవ్యాలవల్లా రెండూ మనకు తగవు. అందువలన సంధిచేసుకుందాం. ఈ పుట్టని మీరు మాకు అప్పుగా ఇవ్వండి. మేము స్థిమితపడ్డాక మీకో పుట్ట కట్టిపెడతాం—

అన్నన్నా! ఎంతమాటన్నావు! ఇంకేమైనా అడుగు. ప్రాణం అడుగు. అంతేతప్ప...ఓ పక్కనించి స్నేహం బాంధవ్యం అంటూ అప్పు అడుగుతా వేమిటయ్యా? అన్నాడు సుబ్బన్న.

పెద్దచీమ తెల్లబోయింది.

సుబ్బన్న మందహాసం చేశాడు. ఔను, అప్పుఅడగడం అంత అకార్యం – ఇవ్వడమే. ఇన్నాళ్ళు మనం బోతెడంత ప్రేమా గీమా లేకపోయినా పగలేకుండా బ్రతుకుతున్నాం అప్పు అనగానే అది వచ్చిపడుతుంది...నువ్వెరగవు కాబోలు గాని నేను కనీవినీ చాలా అనుభవం గడించాను. అది ఎవరిదగ్గరనుకున్నావు? మనకన్న తెలివైనవాళ్ళు, నీతిపరులు అని చెప్పుకునే మనుషుల దగ్గర. నేను అక్కడేపుట్టి పెరిగానులే.

## గుర్నాధంకథ

ఊరిశివారులో మునసబుగారింటిదగ్గర పుంతలో మా అమ్మ నన్నుకంది. తరవాత ఏ డేగో తన్నుకుపోతుందని వారింటి పెరట్లో గడ్డిమేటు చాటున గోడలో కూర్చోపెట్టింది. ఆ పెరట్లో ఆడవాళ్ళ ఋణగుణధ్వని వినలేకా, వీధివెంపు ఉంటే కాస్తంత కొత్తమొహాలు కనబడి కాలక్షేపం అవుతుందిదనీ మెల్లిగా వాకిలివేపువెళ్ళి వీధరుగులమీద గావెచాటున బసచేశాను. మునసబుగారు పెద్దవాడై కొడుక్కిపని ఒప్పగించేశాడు. గాదెకి కొంచెం అసింటాపడక్కుర్చీ వేసుకుని పులిలాకూర్చుని కృష్ణా రామా అనుకుంటూ, వాళ్ళనూ వీళ్ళనూ చివాట్లేస్తూ పిల్లలకి సలహాలు చెబుతూ, గడించిన ఆస్తిని నిలబెట్టుకునే ఉపాయాలు చేస్తూఉండేవాడు. ఆయన ఉండడం నూనేస్తే బాగుండునని ఆయనకు అప్పుపడ్డవాళ్ళు

అనుకుంటూ ఉండేవారు. కాని ఈయన మొండి వసూళ్ళు పూర్తికాందే పోరాదని తీర్మానించుకున్నాడు. ఆయన కుల దీపకుడు గుర్నాథం ఒకనాడు హడావుడిగా ఎక్కణ్ణించో ఇంటికొచ్చి నాన్నా ఓ అయిదొందలివ్వవే నాన్నా అర్జెంటుగా అన్నాడర్జెంటుగా.

ఏవిటోయ్ ఆ అర్జెంటూ ఏమిటా దూకుడూ ఎందుకంత డబ్బూ అన్నాడు మునసబుగారు.

ఓ ఫ్రెండుకి అప్పివ్వాలిలే, పాపం. మళ్ళీ రేపిచ్చేస్తానన్నాడు అన్నాడు గుర్నాథం.

అట్టె అట్టె గుర్రాన్ని కట్టెయ్. ఔనుగానీ, నువ్వూ వాడూ పోట్లాడుకున్నారా? అన్నాడు తండ్రి.

మునసబుగారు విట్టీగా మాట్లాడతారని ఆయన పెళ్ళాం బిడ్డలూ, ఊళ్ళో జనాభా, అప్పులడగవచ్చేవాళ్ళూ అంతా చెప్పుకుంటూనే ఉంటారు. ఆయన మొహంమీదే నిర్మొహమాటంగా అనేస్తారుకూడా.

తండ్రి చమత్కారానికి కొడుకు నవ్వాడు.

బలేవాడివే నాన్నా. పోట్లాడుకుంటే అప్పుకావాలని వాడెలా అడుగుతాడు. నేనెందుకిస్తానూ అన్నాడు.

ఇంకెందుకుటా, అందుకే పోట్లాడుకోబట్టే వాడికి నీ మీద కోపంవచ్చి అప్పడిగేశాడు. నీకు వాడిమీద తిక్కరేగి ఇస్తానంటున్నావు... అప్పంటూ ఇచ్చాక ఇహ కజ్జాలు రావడం ఎంతసేపుటా అన్నాడు మునసబుగారు.

పోవేనాన్నా. నువ్వంతా విడ్డూరంగా మాటాడ తావు. తొందరగా తాళపుజేతులివ్వు. అతను శివాలయం కాడ కూచున్నాడు. బాగుండదు కష్టపెట్టుకుంటాడు అన్నాడు గుర్నాథం.

కొడుకుమాట పట్టించుకోకుండా, ఓ చుట్టతీసి వెలిగించారు మునసబుగారు. అబ్బే శివాలయం వీధిలో శేషయ్యగార్నెరుగుదువుగదా అన్నాడు.

ఆ ఎరక్కే. వెధవ. మహాదుర్మార్గుడు, రాక్షసుడు.

## శే ష య్య క థ

ఓయ్ ఓయ్ ఆగు. అందుకే అడిగాను. రాక్షసుడన డానికి కారణం ఏమిటి? బాలనాగమ్మని ఎత్తుకుపోయాడా? ఏకచక్రపురం మీదపడి మనుషుల్ని మింగేశాడా? ఏవిటం టావు?...నువ్వేమీ అనొద్దులే, విను. శేషయ్యగారు చేసిన తప్పూ – రాక్షసప్పనీ మరేంకాదు. నరశింహులు అనే ఓ మిత్రుడు కష్టంలోవుంటే తల తాకట్టుపెట్టి పదొందల రూపాయలు అప్పిచ్చి ఆదుకోడం. అంతేనయ్యా. గిర్రున తిరిగే సరికి ఆ బ్రాహ్మడికి వెర్రెత్తించారనుకో. ఇచ్చిన రోజున, పుచ్చుకున్న నరశింహులు ఇతగాడ్ని ఇంతవాడనీ, అంత వాడనీ తెగపొగిడేశాడు. స్నేహం అనే మాటమీద ఎక్క డేనా వాదాలువస్తే శేషయ్య అనే అర్థం తంగున సరిపోతుం

దని దండోరా వేశాడు. తీరా అప్పుతీర్చే వాయిదావచ్చి వెళ్ళేవరకూ, ఆ ఉత్సాహం అప్పుచేసిన డబ్బులా హాడా విడిగా ఖర్చయిపోయింది. పూర్వంమల్లె నరశింహులికి, ఋణదాత శేషయ్య మొహంలో కరుణ తొణికిసలాడడం కనబడడం మానేసింది. అతనిమాటలో పూర్వం పేట్రేగిపోతూ వచ్చిన అణకువ దరిమిలా అణగారిపోయినట్లు అనుమానం వచ్చింది. శేషయ్యగారి ఆత్మవిశ్వాసం కత్తీలేని పొగరు అని ఇన్నాళ్ళూ పోల్చుకోలేకపోయినందుకు అతనూ, అతని కొత్త మిత్రులుకూడా పనులు మానుకు మరీ ఆశ్చర్యపడసాగారు.

శేషయ్యని కొందరు మిత్రులు కదలేశారు – ఆ నరసింహులుగాడి గూబకదలేసి అప్పు వసూలు చెయ్యవేమయ్యా అని. నరసింహులు నా స్నేహితుడు. అతనే ఇచ్చేస్తాడు. చాలా మంచివాడు అన్నాడుట శేషయ్య.

హారి వెధవా! వీడికి అడ్డమైనవాడూ అప్పులివ్వా! ఎంత హేళన! ఇదంతా వెంగెం, శ్లేష్మం కాబోలు. బోడివె...వీడికీ వీడి బతుక్కీ చమత్కారం ఒహటి అనుకున్నారు నరశింహులూ వాళ్లూను. శేషయ్యకి వ్యంగ్యంలో ప్రజ్ఞ ఉందని నిర్ణయించిన మర్నాటినుంచి నరసింహులు కోపం తెచ్చుకున్నాడు.

నేను చచ్చినా వీడికి ఆ బాకీ తీర్చను. చూదాం వాడికెంత ఓపికో. వాడి ఓపిక అంతు కనుక్కునే ఓపిక నాకూ వుంది అన్నాడు నరసింహులు. అతని వాక్చాతుర్యానికి పొంగిపోయి శేషయ్య శత్రువోడు ఉన్నపళంగా పది

రూపాయలు అప్పిచ్చేశాడు. అక్షర లక్షలు అప్పెద్దును పెట్టుబడి పెట్టేవాడుంటే అన్నాడాయన ఉదారంగా. అప్పుడు నరసింహులు కృతజ్ఞతతో ఉక్కిరిబిక్కిరైపోయి, పదిరూపాయల్లోనూ మూడు రూపాయలు అప్పటికప్పుడే అప్పుతీర్చి పారేశాడు.

శేషయ్యే మర్యాదగా నడుచుకొని ఉంటే, వాడికి మాత్రం ఇలా పారెయ్యకపోయాడా అన్నాడు వో నిముషం తరవాత మిగతా ఏడులోను వో మూడు అప్పడగబోతున్న అప్పయ్య. తక్షణం, శేషయ్య మర్యాదస్థుడు కాడు అని యాపన్మంది తీర్మానించుకుని, మర్నాడు సెలవులు పెట్టి అడ్రెసెకిళ్ళమీద ఆ వైనం నలుగురికీ బట్వాడా చేయబోయారు.

ఇలా అప్పులిచ్చి చాలా క్రూరంగా వసూలు చేసినఅందరికీ దుష్టుల కథలన్నీ పైకితీసి దులిపి వెల్లవేసి రంగులువేసి ఆ పంచిపెట్టారు. వర్థమాన నాటక రచయిత ఒకడు 'శేషయ్యలూ పెరుమాళ్ళూ' అనే ఉజ్వల సాంఘికనాటకం రాసేసి, అందులో అప్పులిచ్చేవాళ్ళని ఏకేసి అవతల పారేశాడు. ఋణబాధితులంతా శక్తివంచనలేకుండా గబగబా అప్పులుదండెత్తుకొచ్చి నాటక ప్రదర్శనకు ఏర్పాట్లు చేసుకున్నారు. అంతలో శేషయ్యకు నిజంగా డబ్బు అవసరం వచ్చింది. వియ్యంకుడు శేషయ్యకూతుర్ని ఇంటికి పంపేసి, తిరుగుటపాలో కట్నం బకాయి జమ కాని పక్షంలో తన్మకుమారుడు చి॥ వెంకట్రామయ్య పునర్వివాహ శుభలేఖ మరుగుటపాలో అందగలదనిన్నీ గాన తెలియపర్చడమైన

దనిన్నీ జాబు వ్రాశాడు. అటు నరసింహులు తల కాయడం కోసం, శేషయ్య తన తల తాకట్టుపెట్టగా డబ్బిచ్చినవారు కూడా డబ్బుగాని సదరు శేషయ్య తలగాని రాబోయే ఫలానా తదియనాటికి జమ చేయకపోతే కోర్టులవెంట తిప్పి పరువు ఖర్చుపెట్టించవలసి వస్తుందని అభిప్రాయపడడం మొదలుపెట్టారు.

నాయనా, ఏంచెప్పమంటావు శేషయ్యా ఒకరాత్రి పూట గుట్టుగా వెళ్ళి నరసింహులికి సంగతంతా చెప్పు కున్నాడు. నా పరువు నిలిపి నీపరువు నిలబెట్టుకో అన్నాడు.

డబ్బేదిబావా, ఉంటే ఇన్నాళ్ళా. నా కసలు అప్పు లంటే అసయ్యం. ఒకడికి ఇచ్చినాణ్ణేదప్ప దేహీ అన్న వాణ్ణి గాను. ఇన్నాళ్ళకి ఖర్మగాలి నీదగ్గిర అఘోరించాను బుద్ధి గడ్డితిని. చాలు నువ్వు చేసిన మేలు. పంట కొంపకిరానీ ఇచ్చేస్తా. ఆ శెట్టికో వందో రెండొందలో ఇవ్వాలి, వాడిది కూడా మొహాన కొట్టేస్తాను. పీడా విరగడవుతుంది అన్నాడు నరసింహులు వినయంగా.

భావా నేను అప్పివ్వబట్టికదా ఇంతరబస. యిటు పిల్ల కాపరం నాశనం అయేలాగుండె. లేపోతే రెండేళ్ళు ఆగినవాణ్ణి ఆర్నెల్లు ఆగనా. నువైనా బాగుపడ్డావుకదా. డబ్బు వడ్డీకి తిప్పుతున్నావుట. పోనీ అలా సర్దినాసరే అన్నాడు శేషయ్య దురాశకొద్దీ.

నరసింహులికి, అప్పు తీసుకున్న వాడికొచ్చేటంత కోపమూ వచ్చేసింది. అతని కేకలువిని దొంగలు పడ్డారను కుని జనం పోగయ్యారు.

నరసింహులు భోరుమని ఏడిచేశాడు.

అయ్యో చూడండి ఇదివరస. నాదగ్గిర దేనితాల్లోనో రొఖ్ఖం ఉందని, ఇస్తావా ఛస్తావా అని రోజూ ఇలా అర్థ రాత్రివేళ వచ్చి ప్రాణం కొరుక్కుతినేస్తున్నాడు. లోకం మీద అప్పులిచ్చినవాళ్లూ ఉన్నారు. పుచ్చుకున్నవాళ్లూ ఉన్నారు—

—మరీ ఇంత చేటా ఎంతచేశైనాగాని అంది నర సింహులు ధర్మపత్ని.

నలుగురూ శేషయ్యనే ఆడిపోసుకున్నారు. అతను తలొంచుకు వెళ్ళిపోయాడు. మర్నాడు పట్నంవెళ్ళి కోర్టులో ఓముక్క తగిలించి, వియ్యంకుడింటికెళ్ళి మరోకక్కవాయిదా అడిగి తిరిగి చక్కా వచ్చేవరకూ ఊరు గగ్గోలుగా ఉంది.

నరసింహులింట దొంగలుపడి ఊడ్చుకుపోయారట.

ఏమనుకుని ఏంలాభం. వాళ్ళకి ఋణపడి ఉంటావు. వచ్చి అప్పు తీర్చుకు చక్కాబోయారు అన్నారు కొందరు.

శేషయ్యే చేయించాడన్నారు కొందరు. గిట్టనివాళ్ళ మాటలులెస్తూ అన్నారు కొద్దిమంది. కనీసం ఇలా నర సింహులింట నాలుగువేలు నగదున్నవైనం చెబుతూ ఏ దొంగలముఠాకో శేషయ్య ఓ కార్డుముక్క రాసివారేసి ఉంటాడన్నారు నరసింహులు ఆత్మీయులు. చివరికి అంతా మళ్ళీ శేషయ్యనే ఆడిపోసుకున్నారు. వాడి వెధవచేతో భోరున ఏడుస్తూ డబ్బిచ్చాడు. బెడిసికొట్టి కొంపకొల్లాంపా నాశనం అయిపోయింది అనుకున్నారు అమ్మా, లక్కాను

నాటికీ నేటికీ అతనిమీద ఆ అపరిష్టమ్ముచ్చట అలాగే ఉండిపోయింది. అంచేత బాబూ అప్పులిచ్చే

టప్పుడు జాగ్రత్తగా ఆలోచించి మరీ ఇవ్వాలి. నువ్వే ఏ చెడ్డపని చేసినా చెడ్డపేరు పెట్టడానికి గడువు దొరుకుతుంది గాని, అప్పిస్తేమటుకు ఒరక్షణంలో చెడ్డవాడివిఅయిపోతావు. దరిమిలా డబ్బు చెడ్డవాడివి, చివరికి స్నేహం బంధుత్వం చెడ్డవాడివికూడా అయిపోతావు. ఆపైన నీయిష్టం. తాళం చేతులు ఇవిగో. కావాలంటే పైకం పట్టికెళ్ళు. ఇదంతా నీదే. నాదేముంది అన్నాడు మునసబుగారు.

కులదీపకుడు వంచినతల ఎత్తలేదు. ఎగిరి గంతేసి తాళం అందుకోలేదు. ఓ నిముషం అలాగే కూర్చుని లేచి సరేనాన్నా ఆలోచిద్దాం. రేపు చూదాం అని చెబుతా నా స్నేహితుడితో అన్నాడు.

* * *

కాన, ఓ చీమలసింహాద్రీ ! విన్నావా అదీ కథ అని సుబ్బన్న ఆ కథ ఆపాడు.

చివరికి ఏమైంది? ఆ పిల్లడు మర్నాడు వెళ్ళి స్నేహితుడికి అప్పిచ్చాడా ? అందో చీమ ఉండబట్టలేక.

చెబుదునుగాని పేజీలు పెరుగుతాయి. పబ్లిషరేమంటాడో అన్నాడు సుబ్బన్న.

అప్పు చేస్తాడులెద్దూ అంది నాగలక్ష్మి.

అదిగో ఆమాటేగదా వద్దన్నది అన్నాడు సుబ్బన్న ఇకిలిస్తూ.

ఇకిలింపు బావుందనుకుంటున్నావుగాని కోరలు లేవని గుర్తు తెచ్చుకో, బోసినోరూ నువ్వూను అంది నాగలక్ష్మి కోపంగా.

సుబ్బన్న కథను కొనసాగించాడు.

మర్నాడు సంజెవేళ మునసబుగారి వంశోద్ధారకుడు గుర్నాధం మళ్ళా తండ్రిదగ్గరకు వెళ్ళి నాన్నా ఇచ్చేద్దామే డబ్బా అన్నాడు. మునసబుగారు ఆమసక చీకట్లోనే సాధ్యమైనంత తెల్లబోయి, ఆ వైనం కొడుకు పసిగట్టి ఉండడని అనుమానించి వాడిల్లు బంగారంగానూ – అవసరం తీరాకా అప్పుదొరకా—వాడింకా అప్పుకావాలంటున్నాడురా నీ జతగాడూ అని ప్రకాశంగా ఆశ్చర్యపడ్డాడు.

మర్నిన్నివ్వ లేదుగదే అన్నాడు అబ్బాయి.

నిన్ననిస్తే ఇవాళే మళ్లీ సర్దేస్తానన్నా డనవుట్రా. ఆముక్కే రైటైతే ఇవాళ ఇంకా నిన్నడగాల్సిన పనేమిటీ అన్నాడు మునసబుగారు. పిల్లడు నివ్వెరబోయాడు. తన యుక్తికి సూక్ష్మబుద్ధికి ముసలాయనకు నవ్వు పెల్లుబికి రాబోయి దగ్గుగా తర్జుమా అయిపోయింది.

ఔనే నాన్నా నిజమేమరి అతను ఇవాళే ఇస్తానన్నాడుగదా నిన్నడిగినపుడూ. గమ్మత్తుగానే ఉందే అని తికమక పడ్డాడు గుర్నాధం.

## తాతబ్బాయి కథ

వెర్రినాగన్నా, ఈతరం సజ్జు ఉట్టి కుర్రనాగమ్మలు అప్పు అడగడంకూడా చేతగాదు. ఎందుకు పనికొస్తారంట. మా కాలంలో ఇలాగేనా మరి. మన తాతబ్బాయి ఉన్నా

డంటే ఎంత గట్టివాడూ... వాడు అప్పుజ్జేస్తే ఇలాగే చేశాడా.
ఇంత అవకతవకగానే అడిగాడామరి. నీకు దెల్సా వాడిపెళ్ళి సంగతీ. (తెలీదన్న భావానికి అభినయంగా అరుగునీాద కూలబడి స్తంభానికి జేరబడ్డాడు గుర్నాథం) నాన్నమ్మ కూతురు వరాలమ్మకు మనువెలా అయిందనీ. , అదంతా ఓ కథగాదూమరి. తాతబ్బాయీ, రావకిష్టుడూ ఇద్దరూ తోడ బుట్టినవాళ్ళేనాయె. ఏణ్ణర్ధం అటూ యిటూగాళ్లేనాయె. పిల్లదాన్ని ఎవడికిచ్చి ఎవడికొట్టదనేట్టుటా. ఓనాడుమధ్యాన వేళ కుర్రగాళ్ళిద్దరూ జెమూజెట్టిల్లా, రావలక్ష్మణుల్లా పోటాన పోటీలు పడుతూ వాకిట్లో చలవ పందిరేస్తూ ఉండగా నాన్నమ్మకేం వూహ బోయిందో మరి—ఒకే తాతిగా ఒరే రావకిష్టుడూ అదలా ఒగ్గేసి మీారిలారండర్రా అంది. అప్పగారంటే ఇద్దరికీహడలే. పని ఉన్నపళంగావదిలేసి చేతులు గట్టుకు నిలబడ్డారు. అరుగుపక్కన నాన్నమ్మ పిల్లదానికి మొగల్జడేస్తోంది. ఏవిరా రావకిష్టుడూ వరాల్నిచ్చి పెళ్ళిజేస్తాగాని కూడెట్ట గలవర్రాఅంది. రావకిష్టుడు గర్వంగా చిన్నాడికేసి చూసి, వరాల్ని ఓరకంటచూసి చెప్ పెళ్ళానికూడెట్టలేనివాడుంటాడెస్. అంతగా యేం లేకపోతే అడుక్కుదెచ్చునా పెట్టనా అన్నాడు.

ఓరి నీయింట కోడిగాల్చా. ఏం కూత కూశావురా. కొంపకీ కులానికీ కూడా అపర్దిష్ట మాటంటివిగదరా. మాలక్ష్మినిచ్చి మనువుజేస్తే అడుక్కుతెచ్చి వణ్ణం పెడతా నంటావుర్రా అంది నానమ్మ నవ్వి.

మరి తాతబ్బాయీ నీ మాటేంటిరా. నువ్వా పట్నంలో అడుక్కు దెస్తానంటావా అంది ఇంకో క్షణం ఆగి.

చెచేస్. అడుక్కోడవేంగతి అప్పు. సంపాయిస్తా. అందాకా అవసరమైతే ఎవడితలో తాకట్టేసి అప్పుదెచ్చి బువ్వ పెడతా. ఆపాటి మొగాణ్ణికానా. ఎవడూ ఇవ్వకపోతే నువ్వు ఇస్తావు అప్పు అన్నాడు తాతబ్బాయి ముసిముసి నవ్వులు నవ్వుతూ.

నీకడుపు చల్లగుండ: ఎంతమాటన్నావురా కడుపులో ఎంతోటి ఊహాలున్నాయి. అని ముక్కున వేలేసుకుని అలాగే విస్తుబోయింది నానమ్మ.

అమ్మా జెడెయ్యవేవ్. నొడ నెప్పెడతాది అని మాలక్ష్మి వరాలు గావుకేకేసేవరకూ తల్లి తేరుకోనేలే.

సరే ఇద్దరిలోనూ తాతబ్బాయి ఇంత ప్రవేజకుడు గదా అని—ఇంటిల్లిపాది పెద్దవాడు రావకిష్టుడువేపే మొగ్గినా నానమ్మ పట్టుబట్టి పిల్లని వీడికే కట్టబెట్టింది. మరి తరవాత వాడెంత ప్రవేజకుడైనాడనీ, అప్పులెయ్యడం కూడా ఏమంత గొప్పపని గాదనుకో, అయితేనేం అందులో తల కాయలు మార్చడం మాటసుళువూ మనిషిసుళువూ తెలీడం ఉన్నాయి, తాతబ్బాయి ఇల్లుగట్టాడు గుర్రబ్బండి కొన్నాడు. పెదనాయుడనిపించుకున్నాడు. వాడు అప్పు చేశాడంటే చేసినట్టే ఉండేదికాదు. ఇచ్చినాడికూడా తెలి సేది గాదన్నమాట. ఒక్కనాకాడె వాడిఆట సాగిరాలేదు. నే నీ విషయంలో కాలాంతకుణ్ణిలే...ఎవరదీ ఆ వచ్చేదీ!

నాన్నా చీకటడింది. కోడలు పిల్లని దీపందెచ్చి పెట్టమనూ వాకిటా. ఎవరది నర్సయ్యా! రా రా రావయ్యా అలా కూర్చో అన్నాడు మునసబుగారు కథ ఆపి.

## అప్పలనర్సయ్యా ఉదంతం

గుర్నాథం లోపలి కెళ్ళి దీపం వెలిగించి వచ్చేవరకూ మాటలు వినిపిస్తున్నాయి సావిట్లోకి. నరసయ్యా మహా ఉత్సాహంగా, సూడావుడిగా మాట్లాడుతున్నాడు.

నాయుడుగారూ మీదాకా వచ్చిందీ. ఘంటకితం కరణంగారింట దస్తుద స్తంతా క్రిష్ణార్పణం అయిపోను... ఎవడో నల్లటాడు కోరమీసాలూ జులపాలూవాడూ జీబూతంలా ఉన్నాడు...కాకపోయినా అంత యిద్దైతే ఎలాగండీ. ఎంత కరణవేనా ఇంట్లో అలా వేలకివేలు దస్తు అట్టేపెట్టుకుంటే ఎలా? ఎప్పుడిదప్పుడు పైకి పంపించెయ్యాలి గాని (ఎంతయ్యా పోయిందీ అంటున్నారు మునసబుగారు) ఆ యిదంతా పరపతికోసంలే. పదీ పరకా సర్ది మునసబంత వాడనిపించుకోవాలని తాపత్రయం...అది సరేగాని మాట వరస కడుగుతా ఓరు ఇన్నాళ్ళు మునబుగిరీ చేశారు మంచాయె చెడ్డాయె. రొఖ్ఖం అలా ఇంటో ఎక్కడ పెడితే అక్కడ పడేశారండీ...అహ తెలీకడుగుతున్నా...ఎంత న్నారు...రెండొందలా...చూశారామరి. ఆపాటి మగసిరి లేకనే మీారు అంత కొద్ది రొఖ్ఖం అట్టే పెట్టుకోడం

ఆపాటి పెగ్గ మీకు లేకపోయిందాఅంట. ఏవిటో ఎవడి కటుకువాడు ప్రవేజకుణ్ణనుకుంటాడు వాడితోకే ఆ విద్య పుట్టిందని... ఇదిగో మా వెధవా ఉన్నాడు పెవేజకత్తానికి తెల్లాగ మెయిలుబండికి చెన్నపట్నం వెళ్ళితీరాలి చచ్చి తీరాలి అని పట్టుబట్టి కూర్చున్నాడు. వెధవాయ. నాకేమో రేపు పున్నమెళ్ళిన తదియనాటిగ్గాని ఆ కోపరేటివువాళ్ళు లోను తగలెయ్య నంటున్నారు... ఆవందా మీరిటు సర్దితే అది రాగానే పిరాయించేదాం. ఏదో ఆపాటి పదిరూపాయలు చేతబట్టుకూర్చోగల మొగాడేడంటీవూళ్ళో. ఎవడి మటుకు వాడికి భయమేనాయె—ఏనర్సయ్యావచ్చి అప్పుదెమ్మంటాడో... ఏ నర్సయ్యేవచ్చి కన్నంవేస్తాడోనని... జవాబు చెప్పే సత్తాలేకనేగదా పెతివాడూ రొఖ్ఖం దగ్గర పెట్టుకోంది. మన కాలం ఇలాటి జజ్జుతనం ఉండేదండీ... వందచాలు. పున్నమెళ్ళిన తదియనాడు చంద్రోదయం వేళకల్లా మళ్ళా సర్దెయ్యనూ... పెద్దమనిషితో మాటా మరోటా... అబ్బాయీ ఏమిటి...

అబ్బాయి గుర్నాథం దీపం పట్టుకువచ్చాడు.

మునసబుగారు మీసాలను లాలించి, గుర్నాథం, ఆ సందుగుపెట్లో ఓ వంద దెచ్చి నర్సయ్యకివ్వూ. పద్దు పుస్తకం గూడా పట్రా అన్నారు గంభీరంగా.

*   *   *

నర్సయ్య గాలిదుమారంలా వచ్చి వెళ్ళిపోయాడు.

ఆ ఇందాక చెబుతున్న దేమిట్రా... అన్నారు మునసబుగారు.

అప్పులడిగేవాళ్ళదగ్గిర నువ్వెంత గట్టివాడవో చెబుతున్నావు అన్నాడు గుర్నాధం సావిడివంక చూసి నవ్వుతూ. అట్నించికూడా సన్నటినవ్వు వినబడింది.

ఎవరక్కడా-కోడలా - నీకూకూడా నవ్వొచ్చేనే తల్లీ ...చూదాంగా రేపొద్దున్న నీ మొగుడెంత పెవేజికత్వం చూపిస్తాడో. నాదేముంది. అంతా అయిపోయె, మాకూ మాకూ మొహమాటాలుంటాయి. అదీకాక ఈ నర్సయ్యగాడు మహాటక్కరిలే. వస్తూనే ముందు నాదగ్గిర చేశాపుకి రొక్కం రెండొంద లుంటుందని చెప్పించుకున్నాడాయే, ఆనక మళ్ళీ కాదనకుండా. పరువా మరోటా నువ్వే చెప్పుతల్లీ అన్నాడు మునసబుగారు అంతకుమునుపే పారిపోయినకోడలు నిల్చున్న చోటువేపు చూస్తూ.

గుర్నాధం సిగ్గుపడ్డాడు నవ్వినందుకు.

ఎలాగేనా నర్సయ్య మంచిముడాంవాడు. మర్యాదస్తుడు అన్నాడు మునసబుగారు ఓ నిముషం నిశ్శబ్దంమీద బింకంగా.

అవున్నాన్నా ఊళ్ళో ఆయనకి వీధివీధినా అప్పులే. మర్యాదస్తుడు కాబట్టే అందరప్పులిచ్చుంటారు. మనకే ఆరుబస్తాలగింజ, దీంతో కలిపి నాలుగొందలు రొఖ్ఖం యివ్వాల పద్దుబుక్కులో చూశాను.

పోన్లేస్తూ, అసలు వాడి మాటతీరుకీ, ఆ ఒడుపుకీ ఊరకినే ఇవ్వొచ్చు వందాను దీన్ని జూసైనా ఓ పాఠం నేర్చుకో. వందతో తెమిలిన అప్పుకాస్తా, వెయ్యిదాకా వెళ్ళలేదని సంతోషపడి దేవుడికో దణ్ణం బెట్టుకో.

అన్నట్టూ దేవుడంటే గుర్తొచ్చె... శివాలయంకాడ మా స్నేహితుడు పాపం కూర్చునుంటాడు నా కోసం... ఏం జెప్పనూ? అన్నాడు గుర్నాథం లేచి నిలబడి.

మునసబుగారు ఓ నిముషం ఆలోచించి, పోనీ పైకం పట్టికెళ్లావా. నీ అంతవాడివి నువ్వేను అన్నారు.

కాదులే నాన్నా. రేపటికి వాయిదా వేదాం అన్నాడు గుర్నాథం.

*     *     *

ఆఫీసు వీధి తూము మీద కాబూలీవాలా సిద్ధమైంది ఒకటో తారీఖు సాయంకాలం, గుర్నాథం ప్రాణానికి. బిక్క మొహం పెట్టి తండ్రి ఎదురుగా కూర్చున్నాడు.

## అప్పారావు ఋణహృదయము వివరించుట

ఉదయం ఏడింటికల్లా శివాలయం దగ్గర విరహగీతాలూ అ -ఋణ గీతాలూ పాడుతూ కూచుంటానని, అతన్ని అప్పడిగిన స్నేహితుడు క్రితంరాత్రి బెదిరించాడు. దానికితోడు, గుర్నాథం అతనితో మాట్లాడుతూ ఉండగా, ఒక మొహమాటస్తుడికి సాతిః కూసాయలు సర్దాల్సివచ్చేవరకూ ఆ స్నేహితుడే ఇతనికి అనూాతం ఆపాతికా ఇచ్చాడు. పెద్ద మనిషిని పంపేశాక, గుర్నాథం తీరుబాటుగా ఆశ్చర్యపడి లేచి, బ్రదర్ నీ దగ్గర డబ్బుండగా నన్నెందుకు అప్పడుగుతున్నావూ అని అడిగాడు. స్నేహితుడు ఋణతరుణహాసం

చేసి, ఆ దీన్దేవుందిలే. నీ కోసం రెండు సాయంకాలాలు ఇక్కడ పడిగాపులు పడి ఉండగా, ఉబుసుపోకకి దారే పోయే వాళ్ళని పలకరిస్తూ ఉంటే దానంతటదే జమపడిందిలే అన్నాడు. ఏ విద్య అయినా – ముఖ్యంగా ఋణగ్రహణ విద్య, సాధనచేస్తూ ఉంటేనే తప్ప పనిచెయ్యదని ఉపదేశించాడు. అయినా మన సొమ్మేంపోయె, తెలిసినవాడు మన వాతపడితే ఓ మాటు కులాసా? అని చూసేది. ఔనంటే అయిదో పదో అర్థో పావలో అడిగి జేబులో వేసుకునేది. కాదంటే అదేపాయె. ఇంకోసారి దొరుకుతాడు. కాపోయినా అప్పేగదా. మళ్ళీ ఎప్పుడో అప్పుడు వాడి డబ్బు వాడి మొహాన ఎలాగా విసిరి కొట్టేదేనాయె. ఇంతకీ తీరిక వేళలో అలా రెండూ మూడూ అయిదూ పదీ పడేసి పుచ్చుకోమట్టే గదా ఈ క్షణాన గుర్నాథం పరువు శివాలయందగ్గర నిలబడింది. ఆపాటి గుర్నాథందగ్గిర లేకనా. ఒక్కడుగు ఇంటికెళ్తే కొల్లలు ఇనప్పెట్లో. అయితేనేం ఆ ఒక్కడుగూ వేసేలోగానే పరువులు పోవచ్చు. కొంపలు కూలిపోవచ్చు. కులగిరులు తలకిందులైపోవచ్చు. ముష్టి పాతిక రూపాయలకోసం పరువులూ, కొంపలూ, కులగిరులూ పోయి కూలిపోయి తలకిందులై పోవడం సబబేనా. వాటివల్ల రైళ్ళ రాకపోకలు దెబ్బతింటాయి. దానివల్ల మెడ్రాసులో, వైజాగులో చదువుతున్న వాళ్ళకి మనియార్డర్లు సకాలంలో చేరవు దానివల్ల సరోజలూ, భానుమతులూ, సీతలూ కాలేజీలకూ హైస్కూళ్ళకీ వెళ్ళివచ్చే వేళ గుర్నాథాలు సందు మొగల్లో బస్టాండు దగ్గరా బీటుకాయడం వీలుపడదు. దానివల్ల

సరోజ కళ్ళలోకి లోతుగాచూసి గోల్డు ఫీలవుతూ సిగరెట్లు కాల్చుకోడానికి (దానికీ అప్పు దొరకదుగదా) వీలుండదు. అలాగే అప్పుడు అప్పులిచ్చేవాళ్ళివ్వలేరు. పుచ్చుకునే వాళ్ళు పుచ్చుకోలేరు. చివరికి ఈ విధంగా దేశంలో ఆర్థిక వ్యవస్థ అంతా స్తంభించిపోతుంది. ఇదంతా దేనివల్లటా! గుర్నాథం ఒక మొహమాటస్థుడికి పాతిక సర్దడం కోసమని. ఒక్కడుగు – ఒక్కటంటే ఒక్కటే అడుగుస్మీ – ఆ ఒక్కడుగూ వెయ్యవలసి రాలేకపోవడంవల్ల. ఆ అడుగువేసి ఇంటో ఇనప్పెట్లోంచి డబ్బు తెచ్చేదాకా అప్పారావు కనక ఆ పాతికా గుర్నాథానికిస్తే – తన జేబులో ఉన్న :. పాతికా ఒక్క నిమిషంసేపు గుర్నాథం అజ్మాయిషీకింద, అతని ఇలాకాలో ఉంచితే?... ఏమీ లేదు – లోకం అంతా ప్రశాంతంగా ఉంటుంది. కోకిలలు కూస్తాయి. పువ్వులు పూస్తాయి. అప్పులడిగేవాళ్లు అడుగుతారు. ఇచ్చేవాళ్ళిస్తారు. యివ్వని వాళ్లూ యిస్తారు – సరిగ్గా అడిగితే. పశువులు యెక్కడికీపోవు. ఉన్నచోటే తిష్టవేసుక్కూచుని, సత్యాగ్రహంచేసేవాళ్ళలా ఛస్తే కదలం అ టాయి. కొంపలు కూలనే కూలవు సరికదా కాలరెత్తుకు మరీ నిలబడతాయి పొగరుగా. కులగిరులూ అంతే. అప్పారావుకి వెయ్యి రూ. లు అప్పిస్తానన్న గుర్నాథం ప్రతిజ్ఞలా చలనంలేకుండా అలా నిలబడతాయి. ఇదంతా దేనివల్ల? అప్పారావు జేబులో పాతిక రూపాయల్నీ పిలకట్టుకు యివతలికిలాగి——యివిగో మిమ్మల్నే – వీరు గుర్నాథంగారు. ఒక ఐదు నిముషాలసేపు వీరి చేతులోకెళ్ళి వారు చెప్పినట్టు చెయ్యండి ఎక్కడికి పొమ్మంటే అక్కడికి

పొండి. తరవాత ఆయన మళ్ళీ పంపించేస్తాడు. నా దగ్గరకే వద్దురుగాని బెంగెట్టుకోకండి మరేం ఫర్వాలేదు. ధైర్యమే జయము. సత్యము జయించును. ధర్మరాజు శాంతమూర్తి. నకులుడు, సహదేవుడు, అర్జునుడు, హాభీష్ముడు. పొండి. అంటూ వాటికి నీతిచెప్పి గుర్నాథానికి ఒప్పగించటంవల్ల యింత లోకకళ్యాణమూ ఫెళ్ళుమంటూ జరుగుతుంది. కాదనడానికి మధ్యన అప్పారావెవడు? బోడి అప్పారావు. అంచేత అప్పారావు సాహసించి, త్యాగంచేసి నిస్వార్థంగా ఆ డబ్బుని గుర్నాథాని కిచ్చాడన్నమాట. ఏవిటిచ్చాడు? అప్పు. అప్పనగానేమి మనచేతిలో పాతికరూపాయిల్నికాసేపు గుర్నాథాని పట్టుకోనివ్వడం! అంతే. రేపు గుర్నాథం పెట్లో వెయ్యిరూపాయల్ని వాళ్ళ నాన్నతో చెప్పే-కాసేపు-మహా ఐతే ఓ రెణ్ణెల్లు-డబ్బు చేతికందితేఒకపూటచాలు-అప్పారావుని పట్టుకోనివ్వడం. అంతే. అప్పనగా యిది. అప్పారావనగా నెవరు? దేశసేవచేసి ఇందాకటి పరువూ, కొంపా. కులగిరులూ వగైరాలను కాపాడే మహదవకాశమ్ మారు వేషంలో అప్పారావై వచ్చి గుర్నాథం ఎదట నిలబడింది. హిందూ థింకర్సు.. అన్నదదే. హిందూఫిలాసఫీ, హోల్ హిందూఖాట్, ఒక హిందూథాట్ ఏమిటి హోల్‌వరల్డు థాట్ అంతా కూడా గొంతు చించుకుని అన్ని భాషల్లోను ఘోష పెడుతున్నది యిదే. అబ్బే అప్పారావు నిన్ను గనక అప్పడిగితే వాణ్ణి ఉదరించడం అనుకోకు. అప్పిచ్చే ఛాన్సును, అవకాశాన్ని, అదృష్టాన్ని యింతమంది సామాన్య జనులలోనూ నీకే యివ్వాలని నిన్నే ఎన్నికచేసి ఎడ్రసు కను

కున్నాని వెతుక్కుంటూ వచ్చిన సహాసీయుడని తెలుసుకో. వాడిని చూచి ఆనందపడి పొంగిపో. స్వామీ తమరు ఎంత అప్పు ఇచ్చే మహదవకాశాన్ని నాకు ప్రసాదిస్తున్నారు. నేను బహు యోగ్యుణ్ణి అనీ, నేను అప్పిచ్చి మళ్ళీ ఎన్నాళ్ళకీ అడగననీ లోకం కోడై కూస్తోంది. కాన కటాక్షించి నాకు కొంచెం పెద్దకోటా యిచ్చి అప్పు ఎక్కువ తీసుకోవలసిందని వేడుకుంటున్నాను, అని ప్రాధేయపడి మరీ ఇవ్వాలి. అయితే గుర్నాధం అలా అన్నప్పటికీ అప్పారావు పుచ్చుకుంటాడా? కోడు. గుర్నాధం మీద ఎంత ప్రేమ, అభిమానం ఉన్నా అప్పారావుకు పక్షపాతం లేదు. నీకోటా వెయ్యి రూ. లు. దాటనవ్వను. ఇంకోసారి చూదాం అని కరెక్టుగా వెయ్యి రూ. లే, (చిల్లరఖర్చుకి ఐదురూపాయలు కాక) పుచ్చుకొని పోమ్మంటాడు: మళ్లా ఎప్పుడిస్తాడు? ఏమో. గుర్నాధం ఇట్నించి నోట్లు లెక్కపెట్టి వంద, రెండొందలూ, మూడూ నాలుగూ అంటూ ఉండగానే, మరోపక్క నించి అప్పారావు ఆ అప్పును తీర్చి పారేసూ ఉండవచ్చు. లేదా రావలసిన డబ్బు సకాలంలో రాకపోతే వారం పదిరోజులో, నెలా రెణ్ణెల్లో పట్టచ్చు. తరవాత ఆ డబ్బు తిరిగిచ్చి నాయనా దీన్ని ఇంకోడికి అప్పిచ్చి సద్వినియోగం చెయ్యాలని దీవించవచ్చు. అందువల్ల గుర్నాధం ఈ అపూర్వావకాశాన్ని చేజారవిడుచుకోక తప్పకుండా వాళ్ళ నాన్ననడిగి వెయ్యి సర్దేస్తే రక్షించినవాడవుతాడు. అప్పారావు గుర్నాధంమేలు జన్మజన్మలకీ జ్ఞాపకం చేసుకుంటాడు.: ఋణం ఈజన్మకి తీర్చ లేదు. చర్మంచెప్పులు కుట్టించడానికి అభ్యంతరం లేదు.

కాని బాగుండదు. జోళ్ళు పల్చగా వస్తాయి. అంతకన్న గవర్నమెంటువాళ్లు చేయిస్తున్న జోళ్ళు చాలా మంచివి. మన్నును. చౌకనును.

పోతే అప్పుసంగతి. గుర్నాథం కనక రేపు తెల్లారి ఏడున్నరకి రొఖ్ఖం జతపరచకపోతే, అప్పారావు శివాలయం గుమ్మందగ్గిర్నుంచి సరాసరి పొరుగులోకం, ఏ కైలాసమో పోయి అక్కడ అప్పు వెతుక్కోవలసి వస్తుంది. లేదా కోనెల అసింటా కూర్చున్న స్వామీ ఋణానందతో కలసి ఋషీకేశం లేచిపోవలసి వస్తుంది. సన్యాసంకూడా ఆత్మహత్యే నన్నారు పెద్దలు మరి. కాబట్టి గుర్నాథం ఈముక్క మనసులో ఉంచుకుని మరీ వాళ్ళ నాన్నని ఒప్పించడం మంచిది. అని ఋణధీరుడు. డా॥ అప్పారావు క్రితంరోజు రాత్రి శివాలయందగ్గర గుర్నాథానికి ఋణహృదయం విశదం చేశాడు.

ఆముక్కే మనసులో ఉంచుకుని వో మూల తనకీ అనుమానం పీకుతున్నా. తండ్రి ఎదట పడి నసుగుతూ నిలబడ్డాడు గుర్నాథం మర్నాడు ఉదయం. అని సుబ్బన్న కథ ఆపి కడుపారా గాలి భోంచేసి బుస్సున తేన్చాడు.

*        *        *

ఇంతకీ ఎవరీ అప్పారావు. ఆపిల్లాడు వీడికి అప్పిచ్చేశాడా? అన్నాడు చీమల సింహాద్రి కుతూహలంతో.

సరిగ్గా ఈ ప్రశ్నే మునసబుగారూ అడిగారు

అబ్బాయ్ ఎవరోయ్ ఈ అప్పారావు. నీకెలాంటి స్నేహం ఇతనితో. ఇంత డబ్బు నమ్మి ఇవ్వవచ్చునా? నా మెదుట పడి అడగడేం అన్నారు.

అప్పారావు నాకు మెద్రాసులో స్నేహం అయాడు నాన్నా అన్నాడు గుర్నాథం.

ఎంత స్నేహం అయితేమటుకు ఇలా స్వగ్రామాల దాకా తరివి తరివి అప్పులడుగుతా రుటోయ్ — ఇదెక్కడి స్నేహం అన్నారు మునసబుగారు ఆలోచించి.

గుర్నాథం మందహాసం చేశాడు.

## వచ్చినవాడు అప్పారావు

హు. నాన్నా నీకేం తెలుసునే: అప్పారావు సంగతీ అంది ఆనవ్వ. అప్పారావు ఒక మనిషితో పది నిముషాల సేపు మాటాడికూడా దమ్మిడీ అప్పు అడక్కుండా వెళ్ళి పోయి ఎదటివాణ్ణి చితక్కొట్టేసిన సందర్భాలున్నట్టు చరిత్రలో దాఖలాలున్నాయి. పది నిముషాలూ మాటాడి కేవలం ఒక్క దమ్మిడీయే అప్పుచ్చుకు అవతలివాణ్ణి చితగ్గొట్టేసిన రోజులూ ఉన్నాయి. అతను ఎప్పుడు ఎవర్ని ఎంత అడుగుతాడో ఎవరి దగ్గిర ఎంత ఎలా పుచ్చుకు చక్కాపోతాడో అతనికే తెలియాలి. అతనికీ తెలియదేమోగూడా. ఆఋణలీల మనకి అర్థంగాదు. మనదేముంది? మనమంతా నిమిత్తమాత్రులం. కేవలం అప్పిచ్చే క్వాలిఫికేషన్ ఉంటే చాలు. ఒక్కొక్కసారి అదీ లేకపోయినాసరే, ఆ సదుపాయంకూడా అతడే చేసిపెడతాడు. నాన్నా! నీకు తెలుసో తెలీదోగాని ఇండియాగవర్నమెంటువాళ్లు, ఇంకా చిన్న సర్కార్లవాళ్ళు, రిజర్వుబ్యాంకువాళ్ళు, దేశంమీాదా విదే

శాల మీదా అప్పులు నొల్లుకోవాలంటే, బ్యాంకీలవాళ్లు డిబెంచర్లు ప్లోట్ చెయ్యాలంటే ఓం ప్రథమంగా ఇతన్ని ముందు సలహాఅడిగి గాని మరొకపని చెయ్యరట. ఫోర్డు, రాక్ ఫెల్లరు, జేబిశేలరు, సి. డి. దేశముఖ్ వీళ్ళంతా కూడా ఇతనికి ఉత్తరాలు రాస్తారుట. రెండోకంటికి తెలియకుండా ఇతని రూముకివచ్చి సలహా చెప్పమని అడిగి విని పోతారుట.

అప్పారావు కొత్తరూపాయినోటులా ఫెళఫెళ లాడుతూ ఉంటాడు. కాలదోషం పట్టిన దస్తావేజులాంటి మాసిన గుడ్డలూ, బడిపంతులుగారి చేబదుళ్లులా చిందర వందరగా ఉండేజుట్టూ, అప్పుతెచ్చిన విచ్చు రూపాయలా మెరిసే పత్తికాయల్లాటికళ్లూ, అప్పులివ్వగల వాళ్ళందరినీ చేపల్లా ఆకర్షింపగల ఎరలాటి చురుకైన చూపులూ అతనూ బాకీల వాళ్లకి కోపిష్టివాడి జవాబులా పొట్టిగా టూకీగా వుంటాడు. మొత్తంమీద అతని మొహం ముప్పావలా అర్ధణాలా ఉంటుందని, అతనికి ఎప్పుడూ అంతే అప్పు ఇచ్చే మిత్రుడు అభివర్ణించాడు.

అప్పారావుకి అప్పులుచేయడం ఉగ్గుపాలతో పెట్టిన విద్య అతని పుడకల్లోనే, వాళ్ళనాన్న ఉగ్గు పొరుగింట అప్పుతెచ్చి పట్టించాడు. ఏడేళ్ళొచ్చేసరికే వాళ్ళనాన్న బళ్ళోవేస్తూ పలకలూ ఎక్కాలబుక్కులూ పంచి పెట్టబోయే వరకూ, ఎవరో వచ్చి ఎందుకయ్యా ఇంత ఖర్చు అన్నాడట.

నేను గబగబా బడి చదివేసి పెద్ద పోలీసువాణ్ణయి పోయాకానేమో బోల్డు రూపాయలు అప్పు సంపాయించి అప్పు తీర్చేస్తానుగా అన్నాడు అప్పారావు.

పువ్వు పుట్టగానే పరిమళించింది అని సరసమాడారు అప్పారావు జనకుడు అప్పలస్వామి మిత్రులంతా.

అయితే అందాకా ఈ నా బాకీ తీరదా ఏవిటి అన్నాడు ఆనాటికి అప్పల్సామికి అప్పు సర్దినాయన బిక్క మొహం పెట్టి.

* * * *

అయితే ఇంతకీ వాడు నాయెదుట పడడేం- చెప్పు, అలా ముసిముసి నవ్వులు నవ్వుకుంటే ఎలా అన్నారు మునసబుగారు. యింతసేపూ ఆయన స్టేజిమీద జనాంతికం డైలాగు చెబుతున్న వాడి పక్క నటుడిలా ఏం చెయ్యడానికీ పాలుపోక చుట్ట కాలుస్తూ కూచున్నాడు.

గుర్నాథం చిరునవ్వు నవ్వాడు. నాన్నా అప్పారావే గనక నీ ఎదటపడి అడగడం జరిగితే మనిద్దరం యిలా మూణ్ణాళ్ళు యిద్దామా వద్దా అని ఆలోచించడానికి తెరిపే ఉండేదికాదు. అతను సుడిగాలిలా వచ్చిపడి అడుగుతాడు. అతను వెళ్ళిపోయాకగాని, నువ్వతనికి యిందాకట అప్పిచ్చావని, యింత మొత్తం యిచ్చావనీ నీకు తెలీనే తెలీదు. అంచేత అతను రానందుకు ఆనందించు నాన్నా అంది గుర్నాథం చిర్నవ్వు.

ఎక్కడో అసాధ్యుడల్లే ఉన్నాడే. యిలాంటివాళ్ళ నీ కెలా తటస్థపడ్డారోయ్ అంది మునసబుగారి పొగ కక్కి నిట్టూర్పు.

యివన్నీ తండ్రికి కొడుకు చెప్పేవి కావు. చెబితే ఐదారుమాటలకోసారి భానుమతి మాట రాక తప్పదు. అసలు గుర్నాధం ఫోర్తుఫారం చదువుతున్నపుడు మాటి మాటికీ ఈమాటే వచ్చేది.

## భానుమతి కథ

అప్పట్లో అప్పారావు ఆదుర్కోకపోతే గుర్నాధం చెడ చదివేసి పాసైపోయి ఊరుకునేవాడు. కాలేజీలు తెర చిన కొత్తలో అప్పుడే సెకండియర్ స్టూడెంట్లంతా ఫస్టి యర్‌లో ప్రేమలేఖ లన్నిటికి తరువాయిలు వ్రాస్తూ సశే షాలు సాగదీస్తూ ద్విగుణీకృత ఉత్సాహాలతో జరిగిన కథ లను కొనసాగదీస్తున్నారు. సీతలూ, సరోజలూ కనబడగానే లాస్టియర్ మీకు కాలేజినించి బస్టాండుదాకా సాయం వచ్చిన వాడిని అంటూ పరిచయాలను తిరిగి గుర్తుకు తెస్తు న్నారు. ఒక సాయంకాలం వేళ అందరు ఆ ధ్యాసలో ఉండగా ఎక్కణ్ణించో అప్పారావు బయల్దేరి వీరాభిమన్యు డులా ముందుకు పోతున్నాడు. ఒక్కొక్కణ్ణీ పలకరించి ఒక హలో! (రెండురూపాయలు) హలో హలో (నాలుగు) హలో కులాసా (ఆరు) అంటూ లెక్కప్రకారమే లెఖ్ఖ నందుకుంటూ ఒక వరస పూర్తిచేసి చివర కొచ్చేవరకూ అప్పారావుకి అప్పిచ్చిన మహాదుష్టుడొకడు క్రూరంగా కర్కశంగా కఠినంగా ఆపళంగా అతన్ని నిల్చున్న పళంగా వంటినున్న డబ్బంతా వొలిచేసుకుని పొమ్మన్నాడు.

అప్పారావు నిరుత్సాహపడ్డాడా? లోకంమీద అంద

రిలా అతన్ని తిట్టుకున్నాడా, శపించాడా, ఆఖరికి అతని మీద నిల్చున్న పళంగా "క్రూర అప్పులవాడు" అనే ఒక లావుపాటి సాంఘిక నాటకం గాని, చచ్చు సంభావన ఓ తెలుగుసినిమా (పెరుమాళ్ళుమూర్కు) డైలాగుగాని రాసి పారేశాడా? లేదు. వాటన్నిటికీ టైము లేదు. అర్జెంటుగా అట్నించటే లవర్స్ డెన్ లాడ్జిలోకి పోయి పడ్డాడు. అక్కడ జనాభా అంతా కాలేజీకి సెలవుపెట్టి మరీ ఫీల వుతూ నేపథ్యప్పాటలు పాడుకుంటున్నారు.

హలో కులాసా? అన్నాడు అప్పారావు ఉత్సాహంగా కళ్ళు చిలికించి.

ఎవరూ కులాసాగా లేరుగా, ఇది పనిగాదనుకొని, అక్కడున్న అక్కడ లేనివాడి సిల్కుచొక్కా (చొక్కా ఉండి, అందులో శాల్తీలేదని గ్రహించ ప్రార్థన)లో ఎక్కిపోయి వీధినపడి ఒక గొప్పవాడిదగ్గర అప్పడగబో యోడు హడావుడిగా. దారిలో యింకో బాకీలవాడు కనబడే సరికి తప్పించుకునేందుకు మార్గాంతరం తోచక 'మార్గాంత రాన్ని బట్టి పరుగెత్తాడు. కొంతదూరం పోయేసరికి జేబులు తడుముకుని అరె నాదగ్గర డబ్బుంది అప్పెందుకుటా, అను కుని ఆశ్చర్యపడి లేచి ధారాళంగా దానధర్మాలూ యజ్ఞ యాగాలూ చేసేసి ఖర్చుపెట్టేస్తుండగా అక్కడ లవర్స డెన్‌లో గుర్నాథం స్నానంచేసివచ్చి లాగు బనీను తొడు క్కుని నా చొక్కా ఏదిరోయ్ వాట్ మై షర్టు వేర్ అని గావుకేక పెట్టాడు. రూమ్ మేట్స్ అంతా ప్రేమ సీమ లోంచి ఒక్కసారి జారిపడ్డారు గదిలోకి. ఎవరో నల్లటి పొట్టి

వాడు హడావుడిగా వచ్చి తొడుక్కు పోయినట్టు లీలగా గుర్తు అని ప్రేయసిని ఏమంత గాఢంగా ప్రేమించలేని వాణ్ణొకడన్నాడు. అంతలోకే యింకో మిత్రుడు. అద్దెసైకిలు మీద హడావుడిగావచ్చి గుర్నాథమూ ఎవడో నీ చొక్కా మోకాళ్ళదాకా తొడిగేసుకు మరీ అందులోని డబ్బంతా తగలబెట్టేస్తున్నా...డు...రో...య్ అని, ఓ నిముషం మూర్ఛపోయి తిరిగి వచ్చాక భానుమతి మిడ్‌లాండ్ కెళ్తోంది అని కష్టంమీద చెప్పిపోయాడు. గుర్నాథం గుండె గుభేలుమంది. ఇపుడెలాగా—కొంప మునిగింది. భానుమతి మిడ్‌లాండ్‌కి వెళ్ళినపుడు తను వెళ్ళకపోతే ఇంకేముంది. చొక్కా లేదు. ఈపాటికి అందులో డబ్బూ వుండదు. నీరు గారిపోయాడు. ఎవరైనా ఓ చొక్కా, రెండ్రూపాయలూ అప్పివ్వండన్నాడు. చొక్కాలున్నాయికాని, ఎవరిదగ్గిరా డబ్బులేదు. ఇళ్ళదగ్గిర్నుంచి మనియార్డర్లొచ్చి అప్పుడే మూడురోజులు అయింది. యింకా యెక్కడ డబ్బులు.

గుర్నాథం హడావుడిగా కంటికి నదరుగావున్న రెండు మూడు చొక్కాలు తొడుక్కుని అప్పారావుకోసం బయల్దేరాడు. డబ్బు లేకపోయినా చొక్కా ముఖ్యం. అది లక్కీ-షర్టు. అది వేసుకున్నప్పుడే భానుమతి తొలిసారి నవ్వింది. ఆ సిల్కుచొక్కా అబ్బాయిలేడూ అని యెవరితోనో అంటూ వుండగా తను విన్నాడు.

పార్కుదగ్గిర దొరికాడు అప్పారావు. ఎవరో గుడ్డివాడికి రూపాయి దానమిచ్చి భోరున ఏడ్చి పుణ్యాం గడించాలన్న ఆధ్యాత్మిక చింతనకొద్దీ, తన దగ్గరమిగిలినది

రెండు రూపాయలనోటు అయినందువల్ల మీదగ్గిర రూపా యుందా? అని : అడిగాడు.

అప్పడుగుతున్నాడన్న అపోహతో అతను తల తాటించాడు. అలాకాదు ఫరవాలేదని ఇతను బలవంతం పెట్టాడు. గొడవయేసరికి ఎవరో రాడీవచ్చి, గుడ్డివాడి డబ్బు దోచుకుంటున్నావా అని కూకలేసి అప్పారావు చేతిలో రెండూ పట్టుకు ఉడాయించేశాడు.

గుర్నాథం నోరెత్తి ఒరేయ్ అనేలోగానే, అప్పా రావు అప్పు వసూలు చేసినంత చురుగ్గా యిదంతా జరిగి పోయింది.

గుర్నాథం అప్పారావుని తిట్టిపోశాడు. ఇప్పుడు సినిమా కెళ్ళకపోతే ఎలా అన్నాడు. వెళ్ళడం ఎలా? అని కూడా అన్నాడు.

అప్పారావు అతన్ని ఓదార్చి, అతని చొక్కా అతని కిచ్చి అతను తొడుక్కున్న చిన్నదాంటో తను సర్దుకోని పద చెబుతానని కొంచెం అసింటా ఉన్న హాస్టలుకు దారి తీశాడు. ఆ హాస్టలు గదుల్లో అప్పారావు మిత్రులు – అప్పు లిచ్చేవాళ్లు, ఇవ్వనివాళ్లు చెల్లా చెదురుగా ఉంటారు. ఆ గదుల్లోనే అప్పారావు తన చొక్కాలు కొన్ని స్టాండులికి తగిలించి ఉంచుతాడు. వాళ్ళు పరాగ్గానో, చిరాగ్గానో ఆ చొక్కాలు తొడుక్కుని వాటితో వెళ్ళి ఎవరిదగ్గిరేనా అప్పు చెయ్యవచ్చు. అలాటప్పుడు అప్పారావు డేగలా వాడిమీద వాలి ఇది నా చొక్కారోయ్ అని గావుకేకపెట్టి ఉన్నపళంగా అది విప్పుకు చక్కాపోయి నిమ్మళంగా జేబులో తడివిచూచు

కోడం పరిపాటి. ఒక్కొక్కసారి ఆయా నేస్తాలు డబ్బుతో ఉన్న ఆ చొక్కాలను గదిలోనే స్టాండుకి తగిలించి ఉంచుతారు. అపుడు సరేసరి. డబ్బుమటుకు తీసికొని చొక్కా ఆక్కడ పెట్టి చక్కాపోతాడు. ఇవాళ గుర్నాథాన్ని సినిమాకి తీసుకెళ్లే బాధ్యత మీద వేసుకొని అతను హాస్టలులో ఒక రౌండు కొట్టిచూశాడు. తన చొక్కాలు నాలుగూ పత్తాలేవు. బహుశా డ్యూటీలో ఉండి ఉండాలి అని విచారించాడు అప్పారావు.

అఘోరించాయి అని విసుక్కుని టైమైపోతోంది అని చేతకానివాడి శివతాండవం ఒకటి చేశాడు గుర్నాథం.

ఇక లాభంలేదని, పద, హాలుదగ్గర కెళ్దాం ముందు అన్నాడు అప్పారావు.

గేటులో టిక్కెట్లుదొరకక వచ్చేస్తున్న ఒక సుబ్బారావు కాలరు పట్టుకొని అవునుగాని ఒరే నువ్వా — అనే వరకూ అతను జేబులో రూపాయా యిచ్చేసి, యింతేవుంది బ్రదర్ అని తప్పుకు పారిపోయాడు—చొక్కా చేతినుకతలో పదిరూపాయల కాగితాన్ని పరామర్శించుకుంటూ.

ఇంకో పది నిమిషాలలో రెండు రూపాయలు తెచ్చాడు అప్పారావు.

ఎక్కడివిరా అన్నాడు గుర్నాథం. సీత ఇచ్చింది. సీతా! సీత నీకు తెలుసా? అన్నాడు గుర్నాథం హుషారుగా.

నాకు పరిచయంలేదు. నీకు తెలుసుటగా, నీకా-వాం

లని చెబితే రెండూ ఇచ్చి, చాలా అనికూడా అందిపాపం అన్నాడు అప్పారావు వినయంగా.

గుర్నాథం హైజంప్‌లో పోల్ వాల్ట్ రికార్డు బద్దలు కొట్టేసేవాడేగాని అంతలో గేటులో భానుమతిని చూచి, తనస్థితి తలచుకొని దిగాలుపడి కుంగిపోయి స్తంభంచాటు బెంచిమీద కూలబడిపోయాడు.

అదేవిట్రా అశోకవనంలో సీతమ్మవారి పోజూ నువ్వూనూ. లే. టికెట్టుకొందాం అన్నాడు అప్పారావు.

అంతలో రూపాయిపావలా గేటు దగ్గర కలకలం బయల్దేరి అక్కడి క్యూ దివాలా ఎత్తినవాడి పరువులా చితికి చెల్లాచెదరైపోయింది.

డబ్బున్నవాళ్లూ, భానుమతికోసంకాక సినిమాకోసం వచ్చేవాళ్ళూ పైటికెట్టుకు ఎగబడుతున్నారు. భానుమతి అలవాటు ప్రకారం చెలికత్తెతో కలసి రూపాయపథ్నాలు గణాల వేసే రాజహంసలా, తారురోడ్డుమీద చెవర్లెట్ కారులా, పట్టుదారంమీద ముత్యంలా, వీణమీద స్వరాలలా, బ్రహ్మదేవుడి దగ్గిర్నించి వరాలలా సంగీతంలా వెళ్ళిపోయి 'టూప్లీజ్' అంది.

గుర్నాథం దిగులుపాటకి ఆర్కెస్ట్రాలా దుఃఖపడ్డాడు. పెద్ద టికెట్లు రెండూ కొనడానికి డబ్బు చాలదు. తను ఒక్కడూ వెళ్ళటానికి ధైర్యం చాలదు.

అయినా కాకపోయినా ఆడపిల్లలు అందులోనూ చదువుకుంటున్నవాళ్ళు వన్‌ఫోర్టీన్ కెళ్ళడం ఏవిటి కలి

యుగం! ఎడ్యుకేషనల్ స్టాండర్డులు పడిపోయాయంటేపడవు మరీ అన్నాడు అప్పారావు కోపంగా.

షట్ నోర్మొయ్. వెధవలెక్చరూ నువ్వూను, ఎవడికి కావాలి నీ బాల్డ్ విడో లెక్చర్లు అన్నాడు గుర్నాధం శాంతానికి చేతనైనంతవరకు అభినయం పట్టుతూ.

మనం ఇలా నా స్కాలర్ షిప్‌మీద చర్చించితే ఇది పూర్తి అయేలోగానే ఆ టికెట్లుకూడా అయిపోతాయి భానుమతి సినిమాకి మనం యింటికీను. కర్తవ్యం ఆలోచించుము అర్జునా అన్నాడు అప్పారావు. ఆరుంబావైంది. ఆలోచనకు టైము చాలదు. దానికిముందు బుర్రెక్కడుందో జ్ఞాపకంచేసుకు తెచ్చుకోవాలి ఎలాగూ.

గుర్నాధం, దగ్గరలో ఉన్న గోడమీద ఒక మసి బొగ్గు గీత ఏరుకుని దానిని తేరిచూస్తూ పరధ్యానంలో పడిపోయాడు.

అలా బుర్రని వేస్టుచెయ్యకపోతే కాస్త నా కేమైనా రెండు ట్రిక్కు లాలోచించిపెట్టరాదూ అన్నాడు అప్పారావు.

ఆ? అన్నాడు గుర్నాధం తేరుకుని,

ట్రిక్కు ఆలోచించి పెట్టరాదా అంటున్నా అన్నాడు అప్పారావు.

హూ! లైఫే ఓ పెద్ద ట్రిక్కులా వుంది.

హరి నీ దుంపతెగా! అడగ్గానే అప్పు దొరకా! ఎంత కొటేషనన్నావురా. టైములేదుగాని, తల తాకట్టేసేనా అక్షరలక్ష లప్పిద్దును అన్నాడు అప్పారావు.

ఉందా ఏమిటి నీకు?

అప్పారావు నవ్వాడు. అందుకేగదా నీబుర్ర అప్పడి గాను. సరేగాని నువ్వలా నీరసపడి నీరుగారిపోతేఎలా? అనుం బావై పోయింది. భానుమతి లోపల కెళ్ళి కూర్చుంది. ఇంక సినిమా మొదలు పెట్టేస్తారు, నువ్వింకా అప్పుగురించి ఆలో చించవు ఎలా?

గుర్నాథం పూర్తిగా మేలుకున్నాడు పరాకులోంచి చిరాకులోకి. ఆ క్షణంలో కోపంలో అతనికి అప్పారావు పేరు గుర్తురానందువల్ల ఇడియట్, ఫూల్ వంటి పేర్లతో వాక్యాలారంభించి ఈదుస్థితికి కారకుడూ, స్నానం చేస్తున్న తన చొక్కాని తొడిగేసుకున్నవాడూ (చొక్కా స్నానం చేస్తుందా అని విట్టు వెయ్యడానికి అప్పారావు జంకాడు) అందులో డబ్బుని అప్పారావు నాన్నగారి సొమ్ములా ఖర్చు పెట్టేసినవాడూ అంటూ అప్పారావుని పేరొక్కని ఇప్పుడు ఎక్కడో అక్కడ అప్పు తెచ్చి టిక్కెట్లు కొనే హక్కు అత నికే దత్తం చేస్తున్నట్లు ప్రకటించాడు ఉదారంగా.

చాలా కృతజ్ఞుడిని బ్రదర్. కాని ఒక్కటే చిక్కు నేనుఅప్పుఅడగడం ఆరంభిస్తే ఆగడం తెలీదు. అభిమన్యుడిలా అలా చెక్కేస్తూపోవడమే. అలా వసూళ్ళు చేసుకుంటూ ఏ చిలకలపూడిలోనో ఆగుతాను. అప్పటికి సినిమా మొద లైపోతుంది. అదీకాక నాకు అప్పివ్వాలని తహతహలాడి పోతున్న వాళ్ళంతో ఈ సినిమాభూమి కిటకిటలాడి పోతు న్నట్లు తోచదు. కాన నీవే అందుకు ప్రయత్నించు. వెనుక నా అండదండలు ఉండనేఉంటాయి అన్నాడు అప్పారావు

పదిఅడుగుల అవతల ఒక క్రూర అప్పులవాణ్ణిచూసి, హఠాత్తుగా వినమ్రుడై తల వంచుకొని.

టిక్కెట్లు కొనేసి, సీట్లలో రుమాళ్ళు పడేసిన వాళ్ళంతా ఇవతలకొచ్చి సిగరెట్లు ముట్టించి బుక్ చేసిన సీటు మాజీవితం అన్నట్టు నిల్చున్నారు ఠీవిగా.

ఇంత జనాభావుంది లోకంలో, నిర్దీసితం తే ఒక్కోడి దగ్గరా బస్సుటిక్కట్టుకు పోను ఒకటిరెండన్నా ఉండకపోవు. షూట్. వెళ్లు. స్నేహితులనడక్కు. పరిచయస్థులు వాళ్ళకన్న మెరుగు. జాగ్రత్త. నీపర్సుపోయిందట. ఇవాళ పిక్చరుచూసి తీరాలిట... ముసలివాళ్ళతో అయితే ఇది నీ షేక్స్పియరు అను. పడుచువాళ్ళతో అయితే కోల్మన్ నీ ఆప్త మిత్రుడని నువ్వుచూడలేదని తెలిస్తే ఏలోకానున్నా భోర్న ఏడ్చేస్తాడనీ విట్టీగా చెప్పు. కొంచం మొండిఘటం తటస్థపడితే మాట అని దగ్గరకుపిలిచి సరస్వతితోడు అనమని, నీ లవ్ స్టోరీ టూకీగా చెప్పేసి, సూటిగా అడిగెయ్.

నీ మహారహస్యం వాడొక్కడికే చెప్పావన్న కృతజ్ఞత కొద్దీ తక్షణం ఇచ్చేస్తాడు. దీనికి ఢోకాలేదు. నేను వాడిన మీదటే చెబుతున్నాను, నాకూనీకూ తెలిసినవాడైతే ట్రూ స్టోరీ... ఏది... అప్పారావుగాడు నీ చొక్కా, దాని తాలూకు జేబూ, అందులో డబ్బూ సమిష్టిగా తగలేసి, ఇప్పుడు తప్పు గ్రహించి, ప్రేమకథలో విలన్ అయినందుకు బాధతోకటుకు కటుకూ నాలిక్కరిచేసుకుంటున్నాడనీ అది మానిపించి నాలుకను కాపాడటకైనా రెండు రూపాయలు అవసరమనీ చెప్పు. నమ్మకపోతే నీ కళ్ళల్లోకి

చూడమను. వాట్? బయలు దేరు. విష్ యులోన్. విష్ యూ టూ రుపీస్. అంటూ గద్గద స్వరంతో వీడ్కోలుచెప్పి కంట తడి పెట్టుకున్నాడు అప్పారావు. వాన చినుక్కోసం ముత్యపు చిప్పలా, లైలాక్కోసం ఫిలింసెట్ మీద మజ్నూలా, మని యార్డర్కోసం హాస్టలుగదిలో సీలా, భానుమతి కోసం బస్సుదగ్గిర మళ్ళీ నువ్వేలా, దిలీప్ కుమార్ మూడ్ కోసం ప్రొడ్యూసరులా, ఎదురుచూస్తూ ఉంటా. కదులు. అని గాఢగా తలవంచుకున్నాడు అప్పారావు.

క్రిందని సుర్నాథం కాళ్లు లోభి జేబులో డబ్బులా సిరంగా అక్కడే పడి ఉన్నాయి.

హరిసీ ఇంకా కదలలేదా. ఈ పాటికి అప్పుతెచ్చేసి ఉంటావు, కథ కదులుతుందీ అనుకుంటూ ఉంటే?

నేను వెళ్ళను. నాకుభయం. నా కివ్వరు అన్నాడు సుర్నాథం ముక్తసరిగా.

## ఋణోపదేశం

హరి పిచ్చివాడా అన్నట్టు నవ్వి హరిపిచ్చివాడా అన్నాడు అప్పారావు. ఎందుకలా భయపడతావు వీరంతా మనుషులే మనుషులంతా మంచివాళ్ళే. చాలామంది చేబదుళ్ళిస్తారు అదిగో ఆ గుండాయనచూడు అడగడం తడవు ఇచ్చేస్తాడు. మళ్ళీ మనంతట మనం ఇచ్చేదాకా అడగడు. ఆ చారల చొక్కావాణ్ని చూడు. కనిపిస్తే అప్పుకావాలా అని తనేఅడిగేస్తాడు (ఈ మధ్య మానే శాడు.) మనం అడిగినపుడు చేత డబ్బులేపోతే బెగ్ బారో అండ్ స్టీలు చేసయినా యిస్తాడు. దొంగనోట్లు అచ్చుకొట్టేనా

ఇచ్చేస్తారు. అంత మంచివారు. అందులోనూ ఎప్పుడూ అడగని నీలాంటివాడు అడిగితే ఇవ్వనన గలవాడెవడు? అడగడం పరువుతక్కువని భయపడకు. అప్పులు మహా మహావాళ్ళు చేశారు. జీవితమే ఓ పెద్ద అప్పు. ధర్మరాజు గారికో రోజున రొఖ్ఖం కావలసివచ్చి వేళకి జతపడక భీమసేనుడిని, కుబేరుడి దగ్గరకు పంపాడుట అప్పుతెమ్మని. తీరా అతను అందాకా వెళ్ళి అడిగేసరికి కుబేరుడేమో, నీ అన్న వడ్డీ ఇస్తాడామరి అన్నాడట. రణరంగంలోనే తప్ప ఋణరంగంలో ఏ మంత ప్రతిభాశాలిగాని భీముడు ఠంగున జవాబివ్వలేక మళ్ళీ భూలోకం వచ్చేసి అన్నా విన్నమని కథ చెప్పాడు. వడ్డీ పుచ్చుకోపోతే మనం అప్పు పుచ్చుకోము అని చెప్పు అని కబురంపాడు ధర్మరాజు—ఎందుకైనా మంచిదని. కుబేరుడు అప్పు యిచ్చాడు; వడ్డీవద్దనీ అన్నాడు ఈ ట్రిక్కు బలేగా పనిచేస్తుంది లే... అలాగే ఇంకా చరిత్రలో ఎన్నో. ఎటుతిరిగినా గొప్పవాళ్ళలో అప్పుచెయ్యనివాడెవడు? రాక్‌ఫెలరుకి ఎంతడబ్బున్నా, జేబులో వేసుకు తిరగడుగదా? ఓ అర్ధణా బటాణీలు కొనబోయినపుడు చెక్కులిస్తే వాడు పుచ్చుకోడుగదా, అప్పు చెయ్యకేం చేస్తాడు పక్కవాడిదగ్గిరా? కర్ణుడు, దుర్యోధనుడి దగ్గిర అప్పుచేసి దానాలు ఇచ్చేస్తుండేవాడు. హరిశ్చంద్రుడికి ఇరుగుపొరుగు చక్రవర్తులదగ్గిర అప్పుచెయ్యాలన్న ఊహపోకనే నక్షత్రకుడితో నానా అవస్థలూ పడ్డాడు. ఈ అయిడియా తగిలే ఆపని చేసేవాడు కాదంటావా. అప్పుడు కూడా అపకీర్తి శేషుడు కాగల ప్రమాదం లేదుగా. అసలు

అప్పు పుట్టించే తాహతూ, పలుకుబడీ ఇవే ఒహడి గొప్ప తనానికి గీటురాళ్లు. అప్పంటే ఏమనుకున్నావూ... అదిగో_ ఒకాయన పోవడంలే? ఎంతమంచివాడో నే చెప్పలేను. ప్రతినెలా నాకైదు అప్పిస్తాడు. నేను 30 న తీర్చేస్తా. మళ్లీ ఫస్టున అప్పిస్తాడు... ఏం... అప్పంటే ఏమనుకున్నావు. మహాపవిత్రమైనది. పంచభూతాలలో ఒకటి. పృథ్వి, అప్పు తేజస్సు, వాయువు, ఆకాశం అన్నారు. ఇదీవరస. ఏడాది పొడుగునా, సముద్రుడిదగ్గర 'అప్పు' పుచ్చుకుంటాడు అబ్బుణకిరణాలవాడు. అందుకే ఏడాది తిరిగేసరికల్లా బాకీ తీర్చేస్తాడు వబ్బుణుడు. ఋణాలు తీర్చమని వబ్బుణుడిని కోరేవే ఋక్కులు. వీటితోటే వేదాలనే నాలుగు ఋక్కులు రాశార్ట. నేనెప్పుడూ చూడలేదనుకో. కాని మంచిపుస్తకాలే అయుండాలి. విలవైన ముక్క చెబుతున్నపుడు మెచ్చుకోక తప్పదుగదా. అదీసంగతి. లోకమంతా ఇలా ఇచ్చిపుచ్చుకోడాలమీదనే సాగిపోతోంది. అడిగితేనే ఇవ్వడం ఇస్తేనే పుచ్చుకోడం పుచ్చుకుంటేనే మళ్ళీఇవ్వడం ఈ మూడూ లేకపోతే జీవితం 'బోరు' కొట్టెయ్యదు? కాబట్టి మాటవిని ముందడుగెయ్యి. టైమైపోతోంది. సినిమాకీ సెకెండ్ బెల్ కొడుతున్నారు పద అని ఋణోపదేశం చేశాడు అప్పారావు.

గుర్నాథం కదల్లేదు. ఏమనుకుంటాడో అన్నాడు జంకుగా.

హారినీ అదా నీభయం నీదగ్గిర అడ్డమైనవాడూ

అప్పుచేసి ఎగ్గొట్ట! అన్నట్లు నవ్వి ఆనూశే అన్నాడు అప్పారావు.

నీ కాభయం అక్కరలేదు. అందులోనూ సినిమా కెళ్ళడానికి అప్పడగడంలో తప్పు ఏమీ లేదు. పైపెచ్చు గొప్పభాషను. ఏదో ఆకలి తీరడానికీ. పరువునిలబెట్టుకోడానికీ చెయిజాస్తేతప్పు, సినిమా టిక్కట్లకేవిటోయ్. రాజాలాటి కారణంఅది. సినిమాలను, సిగరెట్లను, 'మందను' మూకను, గుర్రప్పందాలను, ఆటను, పేకాటను, ఇలాటి వాటికి నూటికి నూరుఛాన్సులూ ఉంటాయి అప్పుదొరకడానికి. ఇవ్వలేక పోయినవాడు పశ్చాత్తాపంతో అగ్నిప్రవేశంచేసి ఆత్మహత్య చేసుకుంటాడు. ఇవ్వగలిగినవాడు ఆనందంతో ఇస్తాడు.

అంతెందుకు నా అంతవాడికి ఓసారి అర్జెంటుగా ఓ పాతిక కావాల్సి వచ్చింది. అప్పుడే 'అశ్వమేధయాగం' కథవిని ఆనందంతో పొంగిపోయాను ఎటొచ్చీ మాఅమ్మ పొరుగూళ్లోనే అయినా, నిక్షేపంలా ఉన్నందువల్ల తొలి గ్రామూ, రెండూ౧పాయల చిల్లరాదొరికి తేఅది పట్టుకు వీధిని పడ్డాను. ఇలా తొలిగ్రామొచ్చిందీ, మదరిల్లాకి శావు లేదుటా తిరుగుటపాలో పంపిస్తానూ. ఓ పాతిక సర్దూ అని అడిగితే ఒహాఁ మా విదపడే! పైగా మంచిదిగా అంటాను చివరికిది గాదని ఇంకో ఫ్రెండింటికెళ్ళి అబ్బే ఇలా బెంగుళూరులో అద్భుతమైన పిక్చరాడుతుందిటా, మరి నేను

వెళ్ళి చూడాలని ఫ్రెండు టెలిగ్రాంకొట్టాడూ నువ్విస్తేగాని వల్లకాదూ ఆవటా అన్నాను, రంగున పాతికా చేతపెట్టి అవస్థపడతావేమో మరో పది పుచ్చుకోరాదా అని కాళ్ళా వేళ్లా బ్రతిమాలాడు సిసీపతివ్రతలాగ. వద్దుపో అని తూల నాడి తూలిపడేలా తన్ని ఇవతలికివచ్చి పొట్టచెక్కలయేలా నవ్వుకున్నా. అంతలో ఇంకో మిత్రుడు కనుపించాడు.

ఇవాళ శారద మా హాస్టలు వీధిలోంచి వాళ్ల నేస్తు రాలింటికి వెళ్లబోతున్నట్టు నాకు తెలిసింది. దారిలో కాంక్రీటుపూసి బంగారు మలామావేసి జెండాలుకట్టి బాజా భజంత్రీలుపెట్టి లాండ్రీవాడికి పాతబాకీ ఆరణాలు తీర్చేసి ఓ జత ఇస్త్రీ గుడ్డలు తెచ్చుకుని విలాసానికోసారి భోంచేసి వీధిమొగలోనిలబడి ... అంటూ చెప్పుకు పోయేసరికి వాడు ఇరవైనాలుగుంబేడా యిచ్చి విష్‌యు గుడ్‌లక్ అని వెళ్ళిపోయాడు. కాబట్టి గుర్నాథమూ ఇకనైనా కదులు అని హెచ్చరించాడు అప్పారావు.

అయినా ఈ కథలాగే గుర్నాథమూ అంగుళం కూడా కదల్లేదు. బాబోయ్ నాకు భయమేస్తోంది, అడిగితే వాళ్లేమంటారన్నది ఊహించిన కొద్దీను. నాకు సినిమావద్దు భానుమతీవద్దు. మా నాన్నకి తెలిస్తే మక్కెలిరగదంతాడు అని పరుగెత్తబోయాడు గుర్నాథం.

అప్పారావు అతని కాలరు పట్టుకు ఆపేసి, క్రాపింగు చెరిపేసి, బలవంతాన అతని కుడికాలుజోడు ఊడదీసి అది తాను తొడిగేసుకుని, తనది అతనికి మార్చి. బ్రదర్, కసబియాంకాలా ఇక్కడేఉండు. భయపడకు. నే తెస్తాను

అంటూ ఉత్సాహంగా నాలుగడుగులునడచి దారికడ్డుపడ్డ శాల్త్రికి అడ్డపడి, హలోసర్ యునో గుర్నాథం – మీరు గుర్నాథాన్నెరుగుదురా? ఉంగళకు గుర్నాథం తెరియుమా ఆప్ గుర్నాథ్‌కో జానేహై? తమగి గుర్నాథం గొత్తా? గుర్నాథనే తాంగళ్‌కు అరయూమో? వాట్? అన్నాడు కళ్లు చక్రాల్లా తిప్పి.

ఏందయ్యా నీగోలా అన్నాడాయన.

ఓ, తెలుగేనా మీది! సార్ మీ దేవూరన్నారూ?

నేనేం అనలేదే.

లేదా పోనీయండి. అలా నిష్కర్షగా చెప్పాలి. ఐలైక్ యు. యూ వే ఏమిటి. ఫ్రాంకుగా సూటిగా నిర్మొహమాటంగా నిజంచెప్పే వాళ్ళన్నా సత్యాన్ని పాలించేవారన్నా అడపా తడపా ఐదూ పదీ సర్దేవారన్నా నేను ప్రాణం పెడతానంటే నమ్మండి.

నమ్మను అన్నాడాయన.

అరే! నిజం? మీమీద నాకు గౌరవం క్షణక్షణానికి పెరిగిపోతోంది చక్రవడ్డీలా, నన్ను నమ్మకపోతే పోయెగాని గుర్నాథాన్ని నమ్మండి–గొడ్డు జెంటిల్ మెన్. అప్పు కావాలా అని అడిగినా పుచ్చుకుందికి, సిగ్గుపడతాడు. ముగసబుగారబ్బాయి ఏవూరో గుర్తులేదులెండి. ఇపుడతనికి అర్జెంటుగా టూ రుపీస్ కావాలి. టి. యం. ఓ. రాగానే ఎడ్రసిస్తే మీకు నేనే తెచ్చిస్తా. ఇస్తారుగదూ

ఇవ్వను అన్నాడాయన అప్పారావుని ఎగాదిగాచూచి

ఇవ్వగా! హా! మీకు నిర్మొహమాటమే కాక మంచి హ్యూమరు కూడా ఉందే – చూట్టానికలా ఉన్నా! తెండి బలేవారే టైమైపోతూంది అన్నాడప్పారావు చనువుగా.

ఇవ్వను.

అదేవిటండీ హాస్యం అయిపోయిందిగా. నిజంగా ఇవ్వరేమిటి, నన్నెరగరా.

ఎరగను.

దానికేముంది మనమంతా ఓ కథలోవాళ్ళం. ఆపాటి నమ్మకపోతే ఎలా ?

నాకు తెలీదు.

మీరిస్తారని చెప్పి పంపాడే ?

ఎవడు వాడు.

ఈ కథ రాస్తున్నవాడు.

వాడి మొహం. ఇవ్వనన్నానని చెప్పు.

ఎక్కణ్ణో పోకిరి రౌడీ కారెక్టర్లా ఉన్నావయ్యా, దాచుకో. నీ దగ్గర ఎంత డబ్బున్నా ఖర్చుపెట్టేందుకు వీల్లేకుండా చేయిస్తానుండు ఆథరుతో చెప్పి. హుం అంటూ అప్పారావు ఇంకో శాస్త్రీని చూసి హాలో అని అటు తిరిగి ఓ టూ రూపీసు – అన్నాడు.

మూంబ్రూ బాసార్. ఒక్ షాక్ అన్నాడు వాడు.

ఆలస్యం తగదని, రూపాయ పావలా టిక్కెట్లు రెండు తమదగ్గరనున్నమూడురూపాయలకి బ్లాకులోకొనేసిగుర్నాధం అతనూ హాల్లోకి వెళ్ళిపోయారు. అక్కడ స్తిమితంగా ప్రయ

త్నించి ఇంటర్వెల్‌లోనైనా రూపాయ పద్యాలుగణాలు కొనుక్కుపోవచ్చునని.

సినిమాలో చీకట్లో అప్పారావు, పక్కవాడి చెవిలో జోరీగలా పోరిపోరి డాక్యుమెంటరీ అయేవరకు వాణ్ణిహోరెత్తించాడు. అసలే ఇంగ్లీషు పిక్చరు. అందులో పక్కవాడి ఋణగుణధ్వని. ఇక కథేం తెలిస్తుందని దిగులుపడి అతను లొంగిపోయాడు.

చీకటిలో నా మొహం మీాక్కనబడటంలేదు గాని, మీారు నన్నెరుగుదురు. నేను మీా యిల్లెరుగుదును. ఇప్పుడు కాదన్నారంటే ఆనక వెలుగులో నన్ను గుర్తుపట్టాక నాలిక్కరిచేసుకుని భోరున ఏడిచేస్తారు. నాకేం అన్నాడు అప్పారావు.

ఏందయ్యా నీగోల అన్నాడాయన.

హా లక్కీ! మీారు తెలుగు పీపులేనన్న మాట. ప్రాణం లేచొచ్చింది — తెలుగు మాట వినగానే. మెడ్రాస్‌లో తెలుగూసూస్ లేరన్న గూస్ ఎవడూ? ఇంత మందితో ఇలా కిక్కిరిసి పోతోంటే! వాడి పేరూ ఎడ్రసూ చెప్పండి చెబుతా... మీాకు తెలీదా? డోంట్‌వరీ. శ్రమ పడకండి, హాయిగా సినిమా చూడండి. చూచి ఆనందించండి. ఈలోగా జస్ట్ టూ రుపీస్ పారేసుకోండి. అవి రేపు మళ్ళీ తెల్లారేసరికి మీా సుమ్మానికి వచ్చి తలుపు కొట్టి, పలకరించి ఎత్తుకోమని, జేబులో కెక్కి కూర్చుంటాయి. అద్భుతంలెండి. ...యస్సార్ మై నేమీాజ్ అప్పారావ్... థాంక్యూ... రేపొద్దున్న టువర్డ్స్ మార్నింగ్... పదహోయ్ గుర్నాథం

కవనూన్ అంటూ తనులేచి గుర్నాధాన్ని వెంటబెట్టుకు బయటపడి రూపాయ పధ్నాలుగణాలకి టిక్కెట్టు మార్చేశాడు అప్పారావు.

గుర్నాధం ఆ క్షణాన ఈ లోకంలోలేడు. అప్పారావు హడావుడి చూసి కళ్ళు తిరిగిపోయి విభ్రాంతుడై ఉన్నాడు. టిక్కెట్లు మార్పిడి అయ్యేవరకు మేలుకొని ఎవర్రా అది? నీకు అప్పిచ్చినాయన ఎవరూ ? అన్నాడు మెల్లిగా.

అప్పారావు వులిక్కిపడ్డాడు. అరెరె. పొరపాటై పోయింది. పేరూ అదీ కనుక్కోలేదే. సారీ... అన్నాడు.

గుర్నాధం తెల్లబోయాడు. ముక్కూ మొహం ఎరగని వాడిదగ్గిర అప్పు చేశావా! అన్నాడు.

ఆ, దాందేముందిలే - ఇదివర కెరక్కపోతే ఇప్పుడు తెలుసుకుందాం. పరిచయాలూ, స్నేహాలూ అంతర్జాతీయ సంబంధాలూ ఎలా పుట్టిపెరిగి విరుగుతాయనీ ! అప్పుల మూలాన్నే కదా! అప్పడక్కపోతే వాడెవడో మనమెవడో. డోంట్ వర్రీ. నాకూ నీతీ గట్రా ఉందిలే. సప్త సముద్రాలు గాలించైనా—

ఏమీ అక్కరలేదు. రూపాయ పావలా క్లాసులోకి మళ్ళీ వెళ్ళి ఇందాక మనం కూచున్నచోటు వెతుకు చాలు. అక్కడే ఉంటారు. క్షమాపణ చెప్పుకొని, కాళ్ళు పట్టుకొని హాస్టలుకు లాక్కురా. నేను కూడా నీ మూలాన వాడి కాళ్ళ మీద పడతాను. ఎంత అపద్రిష్ట! సిగ్గులేదురా. ఆ మధ్య

ఉండేదనేవాడివీ! అదంతా ఏం చేశావురా? అన్నాడు గుర్నాథం మండిపడుతూ.

బావుంది ఇంకెక్కడుంగోయ్! సిగ్గు విడిచి రెండేసి సార్లు అడిగితే తప్ప నీరప్పు లివ్వరు. ఎప్పుడో నిండకుండి కాబోలు అన్నాడు అప్పారావు.

ఛప్ ముందెళ్ళి ఆ పెద్దమనిషిని వెతికి కాళ్ళమీద పడు... ఇదంతా మానాన్నకి తెలిస్తే—

అప్పారావు అర్జెంటుగా లోపలికెళ్ళి, తొలిసారిచ్చిన చేబదులు డబ్బులా వెంటనే రంగున తిరిగి ఇవతలి కొచ్చేశాడు హడావిడిగా.

మళ్ళీ ఎందుకొచ్చావు వెళ్ళు. అని గదమాయించాడు గుర్నాథం ఈసారి మెల్లిగా లోనికెళ్ళి అప్పిచ్చిన పెద్దమనిషి పక్కన కూర్చుని సార్. క్షమించాలి అన్నాడు వినయంగా.

మళ్ళీ వచ్చా ఎవడ్రా నువ్వు. ఇందాక నా చేతిలోంచి రెండు రూపాయలు లాక్కున్నది నువ్వేనా ?

అఫ్కోర్సు, నేనేనండి. నేను అబద్ధమాడను. అది చేతనైతే—

నాయనా నీకూ నీ పెద్దలకీ ఓ దండం. ఇక్కణ్ణుంచి పోరాదూ?

నో సార్. తమరు ఒక్కసారి మా హోష్టలుకు దయ చేస్తే మా గుర్నాథం మీ కాళ్లమీద పడాలని మహ యిదవుతున్నాడండి.

ఆయన చీకటిలోనే తెల్లబోయాడు. వాడెవడు? వాడి కదేం బుద్ధి అన్నాడు.

తెలీదండీ, కాని ఒకటి గుర్తుంచుకోండి. మా సుర్నా థానికేదేం హాబీ కాదు_ ఇలా అందర్నీ హాష్టలుకు పిలిచి వాళ్ల కాళ్లమీద పడడం ఏదో ఈసారి సరదా పుట్టింది. ఉన్నవాటిలో మీ వి బెస్టని ఎన్నిక చేసి ఉంటాడు. నా ఒపిని యన్ అడిగితే. భానుమతి పాదాలు సజెస్టుచేసే వాణ్ణితనుల పాకుల్లా...

పెద్దాయనికి సంగతి బోధపడింది. అప్పారావు కేసి ఆ చీకట్లోనే జాలిగా చూశాడు. ఆయన గుండె తరుక్కు పోయింది.

జౌనౌను. అవే మెరుగు నేనూ చూశాను. ఆ నూట నిజమే. బయటకి పద... మీ... వాడి పేరేవిటన్నావు... వాడితో చెబుదాం... దామ్మ... దా... అంటూ అప్పారా వును వెంటబెట్టుకు ఇవతలికొచ్చాడు.

అల్లంత దూరాన్నుంచీ వాళ్లిద్దర్నీ చూసిన గుర్నాథం గుండె గుభేలుమంది.

అమ్మబాబోయ్ అనేందుకు కూడా వ్యవధి చాలక, స్తంభం చాటుకు తప్పుకుని, వారిద్దరినీ సంస్మరించి అలా చాటునుండే గేలువైపు సాగి, అక్కడ ముడుచుకుని, అవతల పడి విశాల ప్రపంచంలోకలసిపోయిహాస్టలుకెళ్ళిపోయిబనీను కూడా మార్చేసి తలపాగా చుట్టుకొని మొహం నిండా బూట్_పాలిష్ రాసుకొని, తెల్లటి మీసాలు ఏర్పరచుకొని పడుకున్నాడు గుర్నాథం.

అరగంట తరవాత అప్పారావు వచ్చాడు ఉత్సా హంగా.

తానొక్కడే వచ్చాడనీ, కాళ్ళాయన – గుర్నాథం, కాళ్ళమీద పడదామనుకున్నాయన... అంటే (గుర్నాథం కాళ్ళమీద కాదు) రాలేదని ఒట్లు సత్యాలు పెట్టాక తలుపు తీశాను.

కాని అప్పారావు ఒక్కడూ రాలేదు! అతనితో పెద్ద ముప్పొకటొచ్చి పడింది.

ఆయన కాళ్ళమీద పడేచాన్సు ప్రస్తుతానికి వాయిదా పడింది. కాని బాధపడకు నిరాశతో, నిస్పృహతో క్రుంగి కుమిలిపోకు. తప్పకుండా నీకా అవకాశం కలుగుతుందని ఆయన గ్యారంటీ ఇచ్చాడు. అసలు నీకలాటి ఊహ రావడమే ఎంతో అద్భుతంగా ఉందనీ, శుభ సూచన అనీ, ఆనందం కలిగించిందనీ ఆయన అన్నాడు. ఐదు రూపాయలు సర్దారు కూడా పాపం. మళ్లీ రేపిస్తానంటే, వద్దు చంపేస్తానన్నాడు. అంతగా అయితే ఏడాదిలో పదేళ్ళలో ఈ జన్మ చివరలో, నా దగ్గిర డబ్బు మరీ ఎక్కువ అయిపోయి దాన ధర్మాలూ గట్రా చేసినపుడు కావాలంటే ఓ నోటు తన మీద పారెయ్యొచ్చు నన్నాడు. ఇలాటి వాడు... ఇంతమంచి మావగారు మనకెక్కడ దొరుకుతారురా? ఇంత ఉదారుడూ దానశీలీ... శిబిదధీచి, మహారథి కర్ణా అన్నాడు అప్పారావు.

## అన్నపూర్ణతో పెళ్ళి ప్రమాదము

ఈ విధంగా ఆరున్నర నుండి ఏడున్నర వరకు అప్పారావు చేసిన ఋణప్రసంగంలో, చెత్త చెదారం వేరుచేసి

దాన్నేపోగేసి చూసుకునేసరికి గుర్నాధం గుండె గంటన్నర సేపులోను రెండోసారి గుభేల్‌మంది.

బాబోయ్! భానుమతెలా? ఆ పిల్లని తప్ప ఇంకోళ్ళని చచ్చినా చేసుకోను. రామయ్యగారి ట్వంటీ యాకర్సు పొలం వద్దు, వాళ్ళ అన్నపూర్ణ అంతకన్నా వద్దు. చచ్చేనా పోతాను గాని చచ్చినా చెసుకోను అన్నాడు గుర్నాధం.

రామయ్యగారిని గనక నువ్వు అవమానిస్తే మీ నాన్న తక్షణం కులిగ్రాం మీద నీ డొక్క చింపించి డోలు కట్టించి దానిమీదే తండ్రి మాట వినని పుత్రుడి గాథ ఏమైనదో టముకు వేయించేస్తాడు. మిగతా డొక్కతోటే డోళ్లూ బుర్రలూ చేయించి, బుర్రకథలు చెప్పిస్తాడు అన్నాడు అప్పారావు.

చెయ్యనీ చూదాం.

చూదాం కాదు విందామను. వినడాని కూడా నువ్వుండవుగా.

ఛప్ నోర్మూయ్ హిస్టరీ లెక్చరర్లా చవట విట్లూ నువ్వూను. వేసినవే వేస్తూ నవ్వడానికి విసుగు లేదూ ?

హిస్టరీ లెక్చరరు విట్టు నేనెపుడూ రెండోసారి విన లేదుగా సీలాగ. హిస్టరీ లెక్చరరు విట్టుకన్నా చాలాబావుం డని "విట్టు" మీ కాబోయే మామయ్య రామయ్యగారు. రేపు తెల్లారి ఎనిమిది ఘడియలకు రెండోసారి నీకు తటస్థ పడతారు. అది చూడు ముందర అన్నాడు అప్పారావు.

గుర్నాథం తలవంచుకున్నాడు మాటాడకుండా. అతని కేం పాలుపోలేదు. వాళ్ళ నాన్న పంపిన అన్నపూర్ణ ఫొటో వంక చూస్తూ దిగాలుపడిపోయాడు.

అప్పారావు తేలుకుట్టినట్టు లేచి కిటికీదాకా వెళ్ళి మళ్ళీ వచ్చి, పద విచారించకు సినిమాకి పోదాం అన్నాడు. ఈసారి నిజంగా డబ్బుందిలే. హాలు దగ్గిర అప్పుచెయ్యను అని ధైర్యం చెప్పాడు.

ఎక్కడిది? ఆయన యిచ్చిందేనా? అన్నాడు గుర్నాథం ఆ బాధలోనే కాదు,ఇప్పుడు వరండాలో రాజు పోతుంటే కిటికీలోంచి అడిగాను. మారుమాటాడకుండా ఇచ్చాడు. ఎలాగేనా చాలా పెద్దమనిషనుకో. నువ్వు వెయ్యి చెప్పు...ఛీఛీ అదేమిట్రా హీరోయినులా అలా...తప్పు సిల్లీ. ఏమిటి సంగతి వాటీజ్ రాంగ్?... అరే!

గుర్నాథం కళ్ళు వత్తుకున్నాడు. మా నాన్న మనియార్డరు పంపగానే నీకు పదిరూపాయలు అప్పిస్తాగాని, రేపటి సమస్య చూడరా. ఈ పెళ్ళి జరిగితే, నే చచ్చిపోతాను. జరక్కపోతే మా నాన్న చంపేస్తాడు...ఎలాగ.

అప్పారావు జాలిపడ్డాడు... పుట్టుట గిట్టుట కొరకే అనకూడదనుకో యిపుడు. అయినా...అంత భయమేమిటి. రామయ్యగారు రేపు నిన్ను చూడగానే భేష్ అనేస్తాడే అనుకుందాం. ఆయన అభిరుచిమీద నాకు గురిలేదు. అప్పులు బాగా ఇచ్చినా సరే. ఆ అమ్మాయి అన్నపూర్ణ ఒప్పుకో వద్దు? కోడిలా చూపులూ, బోడి షోకూ వీమా నాకేం. ...వులేను నాన్నా అనేస్తే ? అన్నాడు.

అలా అనకయ్యా. నన్ను చేసుకోపోతే ఇంచుమించు చచ్చిపోతాన్నట్టే మాటాడిందిటా అమ్మాయి.

ఇద్దరూ మాటాడలేదు.

పోనీ ఓపనిచేస్తే...అన్నాడు సుర్నాథం. ఈయన కాళ్ళమీద ఎలాగా పడదామనుకున్నాంకాబట్టి రేప్రొద్దున్న రాగానే ఆపనిచేసి అయ్యా! ఇలా నేను ఫలానా పిల్లని చేసుకోవాలనుకుంటున్నాను. నా మీద దయయుంచి మీ అమ్మాయితో పెళ్ళి తప్పేందుకుమీరే ట్రిక్కు చెబుదురూ అని రహస్యంగా అడిగితే?

అప్పారావు జాలిగా నవ్వాడు. ఆయనకి నువ్వు చెబుతున్న ఫలానా అమ్మాయి భానుమతి మీద ఏమాత్రం మంచి అభిప్రాయం ఉన్నట్లులేదు. నవ్వేస్తాడు; తానేమిటి నవ్వేశాడుకూడా అన్నాడు అప్పారావు.

సుర్నాథం ఉలిక్కిపడ్డాడు. అదేమిటి! భానుమతి ఆయనకు తెలుసా? అన్నాడు.

భానుమతిని అప్పారావే ఆయనకు పరిచయం చేశాడు.

ఏం చెయ్యను! ఇందాక హాలుదగ్గిర నువ్వుపారి పోయాక ఆయన నన్ను పిచ్చివాడని పోలీసుకి ఒప్పచెప్ప బోయి, నా ఇంగ్లీషూ అదీ విని దంగైపోయి నాలిక్కరచు కున్నాడు. సారీ అన్నాడు, తరువాత కాఫీతాగాం. తరవాత నాసంగతి అడిగి నీపేరెత్తి నీ ఎడ్రసు అడిగాడు. నువ్వు

తెలుసునని చెప్పి ఎందుకని అడగడం మర్చిపోయి మనకథ చెప్పాను.

భానుమతి ముక్కు కొంతదూరంవచ్చి గబుక్కున పైకి తిరుగు తుందన్నాను. నవ్వాడు ...వాళ్ళింట్లో వాళ్ళు భానుమతి ఉందిగదాఅని ఇంటికి దీపాలు పెట్టించుకోలే దన్నాను ...నవ్వాడు ...భానుమతికి నడుము ఉందని కొందరూ, లేదని కొందరూ పందాలు వేసుకున్నారనీ, ఉందన్నవాళ్ళు ఓడిపోయారనీ చెప్పాను. అబ్బా అన్నాడు ...నవ్వి నువు నవల్సులు రాయకూడదోయ్. అవునుగాని, గుర్నాధం ఎద్రసేమిటన్నావూ. బుద్ధిమంతుడేనా? అత నున్నాడని హాస్టల్లో దీపాలుమానేశారా ఇలా మాపిల్లనిద్దా మనుకుంటున్నాం, పిల్ల చిదిమి దీపం పెట్టినట్టుంటుంది. రేపొ ద్దున్నొచ్చి అబ్బాయినిచూసి అతను ఔనంటే—ఈపాటికి మా పూర్ణమ్మఖాటా అందేవుండాలి— ఊరికెళ్ళానే తాంబూలాలిచ్చుకోడమేనూ అన్నాడు—అన్నాడు అప్పా రావు.

గుర్నాధం దిగాలుపడిపోయాడు. ఏందారీ?అన్నాడు.

ఏందారిచెప్మా అని అప్పారావుఆలోచించబోయాడు.

ఆల్‌రైట్ గూర్నాధం, అన్నపూర్ణతో పెళ్ళి తప్పే మార్గం ఆలోచిస్తానుగాని నువ్వు ఇందాక మాటిచ్చావు చూడు—ఏది—మీనాన్న మనియార్డరు పంపగానే నాకు పదిహేను అప్పిస్తానన్నావేం, ఆ యిరవయీ గనక ఇప్పుడెక్క డైనా ఎడ్వాన్సుగా అప్పు తెచ్చి ఇచ్చావో నాకు బుర్ర అమోఘంగా పనిచేస్తోంది. తెల్లారేసరికి ఫస్టుక్లాసు అయి

డియా పుస్తుంది. నేను మళ్ళీ నీ పాతికా నీకు పువ్వుల్లో పెట్టి ఇచ్చేస్తాను డబ్బురాగానే. ఏమంటావు? సయ్యేనా? బాగా ఆలోచించుకో. ముప్ఫైరూపాయల అప్పుతో నీ జీవితం అంతా బ్రెహ్మాండంగా అయిపోయే అయిడియా ఇస్తాను. చెప్పు సరేనా? అన్నాడు.

సుర్నాధం గబుక్కున తలవంచుకుని మళ్లీమెల్లిగా బాధగా దేవదాసులా తలెత్తిచూశాడు. అబ్బే నువ్వలా రేటు పెంచకుండా ఉంటే పదికాదు ఐదు రూపాయలేనా సరే ఇస్తాను అన్నాడు.

నాజోకుపక్క నీజోకు డోకులావుంది.. సర్లే పడుకొని నిద్రపో. రేపొద్దున్న అన్నపూర్ణతో పెళ్లి తప్పినందుకు ఒక గ్లాక్ సాంగూ, ఎల్లుండి భానుమతిని చేసుకోగల ఛాన్సు పేరుచెప్పి ఒక యుగళగీతం, అసలు ఎవరో ఒకర్ని పెళ్ళి అంటూ చేసుకోవలసివస్తున్నందుకు ఓ బ్రెహ్మాండమైన శాడ్ సాంగూ పాడుకుంటూ నిద్దరపో, ఈలోగా పాట మధ్యన ఆర్కెస్ట్రా వచ్చినపుడు చక్కగా నువ్వునాకు బాకీ వున్న యాభైరూపాయల అప్పుగురించీ జ్ఞాపకం చేసుకుంటూ ఉండు, ఎక్కడలేని దిగుల్లో పోతాయి. అంటూ అపారావు అక్కడనించి వెళ్ళిపోయాడు.

సుర్నాధం భానుమతితో ఆలోచనలు ఆరంభించడంతో అవి అక్కడే ఆగిపోయాయి. కాస్సేపటికి, అన్నపూర్ణ అనే పెళ్ళికూతురు బొమ్మ, దాన్ని బలవంతాన తనకి కట్టబెట్టడానికి రేపొద్దున్న, వాళ్ళనాన్న వేషంలో వస్తున్న రాక్షసుడు రామయ్యగారూ గుర్తుకొచ్చి, ఈ పెళ్ళికాదంటే

తన తండ్రికి రాగలకోపం గుర్తుకొచ్చి, అతనికి ప్రాణం బెంబేలెత్తిపోయింది.

ఇహ నిహ లోకంలో ఉండి లాభంలేదని, సుబ్బరంగా చచ్చిపోతే స్వర్గంనుండి భానుమతిని, ఆమెకాబోయే భర్తను దీవించి నీవైనా సుఖపడుమా అని తను ఏడుస్తూ పాడడం మంచిదని నిశ్చయించుకున్నాడు. ఈవిధంగా తను ఆత్మహత్య చేసుకోబోతున్నట్లు వాళ్ళ నాన్నగారికీ, సంఘానికీ, ప్రపంచానికీ, పోలీసు కమీషనరుకీ నాలుగు పొడుగుపాటి ఉత్తరాలు మొదలుపెట్టి, ఒకటోది సగం రాసేసరికి సూయిసైడుకి స్పెల్లింగు కుదరక, కుదిరిందినచ్చక నచ్చింది రాస్తే నాన్న తిడతాడని, తిట్టి మనియార్డరు పంపడనీ అనుమానంవేసి, ఆ సమస్యలో కొట్టుకులాడి నిద్రలో మునిగిపోయాడు.

పొద్దున్న ఎనిమిదిన్నరకి తెల్లవారింది. లైసెన్సున్నవాళ్లూ, మొండివాళ్ళూ ఒకటితిన్నా పది తన్నగల జబ్బపుష్టిగలవాళ్లూ రొటీను సినిమాపాటలు పాడుతున్నారు. లేనివాళ్ళు ఈలలేస్తున్నారు. అదీరానివాళ్ళు వింటూ విసుక్కుంటున్నారు.

కొందరు నిన్నసాయంత్రందాకా వదలకుండా అప్పులవాడిలా తగులుకున్న పాటను అది పరాగ్గా ఉండగా విప్పిపారేసి, కొత్తపాట తొడుక్కుంటున్నారు. కొందరు బద్ధకయోగాసనాలు వేస్తున్నారు. మిగతావాళ్లు అద్దంలో సౌందర్యారాధన చేస్తున్నారు. రాగాలేవీ రానివాళ్లూ దేవదాసులూ తదితర భగ్నప్రేమికులూ, పిరికివాళ్లూ, ఫస్టు

మార్కులు, మెడల్సూ కోరే దురాశాపరులూ, చదివితేనే పాసవుతామని పొరబడ్డ అమాయకులూ, ఏమిరాతోచని వాళ్లూ, ఈ క్లాసుపుస్తకాల్లో అసలేం రాస్తారో ఓసారి చూదాం అని కుతూహలం గలవారూ, రెండు జెడల సీతలు అడిగితే ఇచ్చేందుకు నోట్సులు రెడీగా ఉంచాలనుకునే వారూ పుస్తకాలు తీసి చదువుకుంటున్నారు. అప్పారావు చురుగ్గా ఏ జేబులో ఏ అప్పుందోనని అందర్నీ అడిగి అంది నంతవరకు అప్పులు చేస్తున్నాడు అందులోనే కొంత తీరుస్తు న్నాడు – మన సొమ్మేంపోయిందని.

## ప్రమాదం తప్పిన ప్రకారము

గుర్నాథం కళ్లుతెరిచి తొలిచూపులు ప్రసరించిన వేళకి రెండు బుర్రమీసాలమీద పెద్దముక్కుకి ఎడాపెడా నల్లంచు కళ్ళజోడుతో ప్రపంచం పుట్టింది. ఆ మీసాలకింద మెడచుట్టూ జరీకండువా, రెండు భుజఖండాలూ, వాటికింద కిటికీ, దాని అంచుమీద ఇంకో జరీకండువా దానిముఖ్య అప్పారావు తల వెనకవేపూ ఉన్నాయి.

గుర్నాథం ఇంకా లేవలేదుసార్. రండి ఇలా నించోండి. రాత్రి పావలా పాయింటుమీద ఆడాడేమో టైము తెలిసిందిగాదు ఏదీ ఇప్పుడే కన్ను మూశాడు. కను కట్టిందోలేదో ఇంకా పాపం అంటోంది అప్పారావుకంఠం.

గుర్ గుర్ మని చప్పుడైంది మీసాల మొహంవేపు నుంచి.

మరేండి. ఓ పక్క లెక్చరర్లు పరీక్షలు గిరీక్షలు అంటూ ప్రాణాలు తీసేస్తారండి. ఇక్కడ మా అవస్థలు వాళ్ళకేం తెలుసు. పాపం మా వాడికి కాలేజీవేపు వెళ్ళడం అంటేనే భయంగావుంది. దానికితోడు ఫీరమ్ఫీజోటి కట్టాలి. రాత్రి పావలాపాయింటుమీద ఆడిందందుకే. అందులో స్వార్థంలేదు. కేవలం వాళ్ళకోసమే—ఆ కాలేజి ఋణాన పడుండడం ఎందుకూ ఆ డబ్బేదో పారేస్తే సరిఅని. కాని ఆట అడ్డంతిరిగిందాయె. మీ అల్లుడు అణ్లక్కీ ఇన్ కార్డ్సు. అంతమాత్రాన లక్కీ ఇణ్లవ్ అనుకునేరు వట్టి దుర దృష్టవంతుడు...నిజంగా వాడి ఇది తలుచుకుంటే మీ గుండెకూడ ఇద్దైపోతుంది.

మీసాల మొహం పొడిదగ్గు దగ్గి ఎవరు? నువ్వు చెప్పేది గుర్నాధం మాటే?—మా నాయుడిగారి గుర్నాధమే? అంది.

గుర్నాధం నవ్వుకున్నాడు విలాసంగా.

కాకపోతే ఇంకెవరండీ అంటున్నాడు అప్పారావు. గుర్నాధం ఒకడే ఉన్నాడు వాడిగురించే నేను చెప్పేది. నేనేమిటి లోకం అంతా కోడైకూస్తోంది. కొక్కొరోకో అంటూ. మంచే కానీండి, చెడే కానీండి, చర్చఅంటూ చేస్తోందిగదా. మంచీచెడ్డా అనేవి రిలెటివ్. మనిషికీ మనిషికీ ఉండే చుట్టరికాన్నిబట్టి ఉంటాయి. నేనంటే మీకు గిట్ట నపుడు నాకు మంచిదైంది మీకు చెడ్డది. ఏమంటారు? భేషైన మాటన్నానుగదూ. ఇంకా బోల్డు అనగలను. పుచ్చుకునేవాడికి అప్పు అయినదే ఇచ్చుకునేవాడి ప్రాణా

నికి బాకీలా కనిపిస్తుంది. నిజానికి ఆ మధ్య నున్నది కేవలం పదిరూపాయలనోటే వీడికీ, వాడికీ కొండమీద కోతికీ అందరికీ కావలసిందదే. దాన్నే కొందరు అప్పుఅని పొరపడతారు. కొందరు బాకీ అని భ్రమిస్తారు. కొందరు ఇవ్వం అంటారు. కొందరిస్తామంటారు. ఈ భ్రమా భ్రమణం మధ్య అఖండజ్యోతిలా వెలిగేది డబ్బు... అందుకే ఒక సూర్యుండు సమస్తజీవులకు... అంటూ; ఒక ఋక్కు. అన్నట్టు అప్పంటే గుర్తొచ్చింది చెప్పొచ్చినమాట మీరొక్క రెండువందలు సర్దగలరూ. రాత్రి ఆటకాగానే టాక్సీ దొరికితేసరి; లేదా తెల్లారగనే మీ హాస్టలుకి తెచ్చి ఇస్తాను. మీరు హాస్టల్లోఉండరుకదూ... పోన్లెండి. మీరుండే ఇంటికే ...ఇది నాక్కాదు సుమండీ. మధ్య ముక్కూ మొహం ఎరుగనివాడు ఇలా అడిగాడనుకునేరు. మీ క్కాబోయే అల్లుడికే. పక్కబోయేముందు చెప్పమన్నాడు కావాలంటే కట్నంలో అడ్జస్టుచేసుకోవచ్చు లేదా రేపే ఇస్తాను అని చెప్పమన్నాడు. ఆపైన మీయిష్టం. వాడే అడుగును కాని మొహం చెల్లదట...మనలో మనమాట మళ్ళీ వాడితో అనకండి. ఏడుస్తాడు గాని. వాడిమొహంకన్న సత్తుబేడ చప్పున చెల్లుతుంది. వాట్? వెళ్ళిపోతున్నారేం? డబ్బుయింటికెళ్ళి తేవాలా?...పోన్లెండి ఉన్నదేదో యిచ్చివెళ్తే ఈలోగా రెండాటలేస్తాం...అరె కోపమా? అసలివ్వరా? యూభై కూడా యివ్వరా? నాకేం అల్లుడికి కోపంవస్తే ఆనక మీకెంత ట్రబులిస్తాడో తెలుసుకోండి. సోషల్ డ్రామాలు చదవలేదుమీరు. మొహంచూస్తే తెలీలే? మీసాలూ

మీరూనూ...ఏవండోయ్? ఆగండి మాట. ఇందాక పదిస్తా నన్నారు నాకూ, అయినా ఇవ్వండి. నిన్నటి ఏదు, ఇదీకలిపి ...భలేవాడివయ్యా...ఏవండోయ్! ఆగండాగండి అప్పొద్దు లెండి ఇదిగో మీ మీసాలూ కళ్ళజోడూ ఇక్కడ మర్చి పోయారు...

ఖంగారుగా పోతున్న రామయ్యగారు గబుక్కునఆగి మొహం తడుముకొని ఒక్కసారి ఉలికపడి ధుమధుమ లాడుతూ నేరుగా రైలుకి వెళ్ళిపోయారు...

* * *

అప్పారావు హాస్టలుగదిలో కొచ్చేసరికి యిందాక రామయ్యగారు ప్రదర్శించిన రసాన్నే గుర్నాథం అద్భుతంగా పోషిస్తున్నాడు.

అప్పారావు ఎందుకేనా మంచిదని ఓ కాయితం ముక్క అతనిచూపు పడేచోట పడేశాడు. అది భగ్గుమంది. అబ్బాయ్! పెళ్ళిచూపులకి తెచ్చాను ఊకందువా పంచానూ మనవికావు. నువ్వలా కోపంగాచూపు మాడ్చేస్తే నువ్వే అచ్చుకోవాలి అన్నాడు అతనిపక్కన జేరి.

గుర్నాథం అప్పుడు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ, కొత్తగా నేర్చుకున్న వచ్చీరాని అరవమాటల్లోనూ హిందీలోనూ అప్పారావుమీద తనకుగల అభిప్రాయాలను సమగ్రంగా వివరించి అప్పారావు మేథాసంపదనూ, అతని విధానాలనూ రేడియోలో ప్రతిశబ్దాన్ని ప్రసారయంత్రాలు ఖండించినచెట్టు క్కేశాడు. తన పెళ్ళి సంబంధం తప్పించి

రక్షించిపెట్టినందుకు కృతజ్ఞతనుకూడా మధ్యలో తనకీ అతనికీ కూడా తెలీకుండా వెల్లడించాడు.

యిప్పుడు ఈ రామయ్యగారు మా ఊరెళ్ళి మా నాన్నకి చెప్పేస్తే ఎలా — నేనిలా మూడుముక్కలాట లాడుతున్నాననీ అప్పులు చేస్తున్నాననీ ... ఆయన ఇవి నిజమనుకుంటే, కాదని ఋజువు చెయ్యడానికి జేజెమ్మ దిగొచ్చినా లాభం లేదుగదా అన్నాడు.

అవ్వా బువ్వా ఎలావస్తాయి అని విసుక్కున్నాడు అప్పారావు. ఏదో ఆ టైముకి ఓ బ్రిలియంట్ అయిడియా వచ్చింది అంతే అన్నాడు.

నీ తలకాయ. నువ్వు చేసింది చవటపని. నీది పరమ చెత్త అయిడియా. నువ్వేసే జోకులంత పాతది.

అయితే అప్పివ్వవా ?

ఇవ్వను.

అయితే నీ ఖర్మం నేనుగనక తక్షణం వెళ్ళి కీల్పాకు ఆస్పత్రిలో చేరిపోయానంటే రామయ్యగారికి అంతా తెలిసిపోతుంది. నేను పిచ్చివాణ్ణని నిన్ననే అనుమానపడ్డాడు. యివాళ నమ్మేసి చెంపలేసుకొని నీ రూముకి మళ్లీవచ్చి వరించి అవతల పారేస్తాడు. అప్పుడు దేవుడు కాదు, నేను కూడా రక్షించలేను నిన్ను జాగ్రత్త అన్నాడు అప్పారావు శాంతంగా.

ఆరేళ్లతరవాత బియ్యేతప్పి, యింటిదగ్గిర ఆత్మ హత్యే జేసుకుంటానని హడావుడిచేసి ఆ పట్టు పట్టూ భాను మతిని పెళ్ళాడేదాకా పట్టుపట్టి నెగ్గి గృహస్థాశ్రమం వాళ్ళలో కలిసిపోయిన గుర్నాథం ... వర్తమానంమీద తండ్రి కెదురుగా, అప్పారావుకి అప్పు మంజూరు చేయించే సమస్య పక్కన, స్తంభానికి జేరబడి జరిగిన కథ నెమరు వేసేవరకూ కళ్లు చెమ్మగిల్లాయి.

* * *

తాడోపేడో తేల్చుకోవోయ్! అలా నానుస్తూ నిలబడితే ఎలా? నీకు అన్నిందాలః సాయపడ్డవాడైతే కాదం డమూ బాగుండదు మరి. కోడలుకూడా నొచ్చుకుంటుం దేమో. మీ యిద్దర్నీ కలిపినవాడుగదా...

గుర్నాథం ఉలికిపడి ఆయనకేసి చూశాడు. ఇదంతా నీ కెలా తెలుసు నాన్నా అన్నట్టు.

మునసబుగారు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ కుర్చీపక్కనున్న ఋణానందలహరి నవలను చిత్తూ ఆవర్జా బుక్కు చాటుకి తోసేశారు గుంభనగా.

గుర్నాథం సిగ్గుపడ్డాడు.

ఇస్తే బాగానే ఉంటుంది నాన్నా. అతను మంచి వాడు మళ్ళీ తప్పకుండా యిచ్చేస్తాడు. ఏనా, ఐదొందలే గదా అన్నాడు నసుగుతూ.

అయిదొందలకేం, అదిసర్లే. తరవాత ఆడబ్బొ, నీ జతగాడూకూడా లేకుండాపోతే ఏంగానూ అని. స్నేహాలు

చెడతాయిచూడూ, ఓపక్క నీకు బాగా కావలసినవా డంటున్నావాయె...

గుర్నాథం ఏదో అనబోయి తండ్రి మొహం చూసి తల వంచుకున్నాడు.

కొడుకు మొహం కవళికలు వాటి చాటున చిన్న బుచ్చుకున్న వైనమూ గమనించి, లాలనగా సర్లేఅనబోయి మానేసి...

అప్పివ్వడానికి రొఖ్ఖమూ, ఇద్దామన్న మనసూ ఎలా అవుసరమో, తీర్చడానికికూడా డబ్బూ, తీరుద్దామన్న మనసూ వుండాలి. అవి రెండూ చూచుకోవాలి మరి ప్రవేజుకుడు కాదల్చుకుంటేను అన్నారు జనాంతికంగా.

కొడుకు మాటాడలేదు. గచ్చు పగులులో ఇరుక్కు పోయిన ఒక చిన్న పూతికపుల్లను ఖైదు విడిపించి ఒక పక్కగా పెట్టాడు.

కొందరు, తీసుకున్నంత దూకుడుగా తిరిగివ్వరు మరి. ఓ పట్టాన ఇవ్వ బుద్ధిగాదు. రాక రాక పెద్దమొత్తం చేతి కొస్తే అదిగాస్తా అప్పులాడి ఎదాన గొట్టటానికి ప్రాణం ఒప్పదుకద.

## చెంచయ్య కథ

...చెంచయ్యకథ దెలుసా? మీ పెదతాత చెప్పే వాడు అప్పులకొచ్చే వాళ్ళకి. వాకిట సులకనుంచం వేసుకు, పులిలా కూచునేవాడు కబుర్లూ కథలూ చెపుతూ, నివ్వెప్పు డన్నా విన్నావో లేదోగాని నాకు అ సమానం మనసులో మెసుల్తూనే వుంటుంది, వరాలుమీద జాలీ వేస్తుంది,

కోపం వస్తుంది. నవ్వా వస్తుంది – చిన్నపుడు ఉట్టి కథే అనుకున్నా. తరవాత్తరవాత దాంటో మజా అనుభవాలైన కొద్దీ తెలిసొచ్చింది.

నువ్వాకథ వినుండవులే చేబదులు చెంచయ్యని పిలిచేవారు. ఒకటిగానీ వందగానీ నోటిమాటనేదప్ప నోటు మాట రాకుండా పుచ్చుకోడం అతగాడి పెగ్గ. అబ్బో, ఇప్పటికథా. నువ్వు మీ అమ్మ కడుపున పడడానికి పుష్కరం నాటి మాట. ఎందుకు గుర్తుంచిపోయింది అనేవు. మీ అమ్మకి సీమంతం జరిగేరోజున నాదగ్గరకొచ్చి ఓ పాతిక వేలు చేబదులిస్తావా బావా అన్నాడు. చెప్పొద్దు, నాకు నవ్వొచ్చింది. అలాగే ఇంకాసేపు ఊసులాడి నవ్వించి, పాతిక రూపాయలు పట్టుకపోయాడు. చెప్పొచ్చింది విను.

చెంచయ్య ఇలాగే మేలమాడినట్లే ఏడుకొండలని ఒక పెదకాపుదగ్గిర నాలుగొందలు చేబదులడిగాడు. ఏడు కొండలు డబ్బు వడ్డీకి తిప్పేవాడే అనుకో, అయితే ఎంత హెచ్చరిగ్గా నిర్వాకం చేసేవాడనీ, ఓరబ్బో, ఆవలించమని పేగులు లెక్కెట్టేసుకునేవాడు మళ్ళీ మనిషి మారుగిల పడకుండా. అప్పుడు శతకోటి లెక్కలుచెప్పి ప్రాణాలు తోడేసి మరీ విదిపేవాడు డబ్బుని. వసూళ్ళుకూడా అంతే. రాకుసుడే. అయితే ఒహ సుగుణం. ఆమాట ముందే చెప్పేసేవాడు. ఏదీ ఇలా నేను రాకుసుడిని బావా అని. ముందు ముందు ఎలాగా యవారం బెడుస్తాది వాడె లాగా వీణ్ని కాబోలీదెయ్యం అంటాడు. అప్పుడు ఏడు, నేను మొదటే చెప్పానుగా నీకూ తెలుసు అని నవ్వి మరీ

కుప్పమీద పంట, అవసరమైతే పైమీది బట్టాకూడా ఎగ
రేసుకు పోయేవాడు

ఏడుకొండలికి ఒక్కగానొక బిడ్డడు. వాడికోసారి
వాతం కమ్మి ప్రాణమ్మీదికొచ్చేవరకు చెంచయ్య రాత్రికి
రాత్రి మూడామడదూరం వల్లకాటి కష్టంపడిపోయి దేవర
గార్ని వున్నపళంగా లేవదీసుకొచ్చి మందు పోయించి
పోయే ప్రాణానికి చక్రంవేసి అట్టె నిలబెట్టాడు. ఆ విశ్వాసం
ఏమూలో నిలదొక్కుకుంది ఏడుకొండలికి.

అదో, మరి ఇంకేకళనున్నాడో, రొంకుపుంజీల
అప్పుకీ చెంచయ్యగాడు నాలుగొందలకాడ బేరం పెట్టగా,
తీసుకోబావా నీకు చర్మం చెప్పులు కుట్టిచ్చినా ఋణం
తీరుద్దా అంటూ – వడ్డీ గిడ్డీ వద్దులే అంటూ ముసి ముసి
నవ్వులు నవ్వుకుంటూ వల్లమాలిన వగాలూ, షరతులూ,
పెట్టకుండా నాలుగు పెద్దనోట్లు వాడి చేత బెట్టాడు. పంట
దింపగానే మళ్ళీ యిచ్చెయ్యాలసి మటుకు మాట దీసు
కున్నాడు. నెత్తిమీద పున్నమిచంద్రుడూ బండినీడలో
నేనూ, కొంచెం అసింటా—అదుగో నీ పెళ్ళాం నిలబడ్డంత
దూరాన, ఏడుకొండలు ఇంటిదీ సాక్షెం.

మూడు తిరిగి నాలుగో పున్నమొచ్చేనాటికి రొక్కం
సర్దుబాటవుతుందనీ, తప్పకుండా ఇచ్చేస్తాననీ, వడ్డీకూడ పదో
పరకో ముట్టచెబుతాననీ సత్తెపెమాణం పెట్టాడు చెంచయ్య.
ఇలా ఆపదకి అడ్డుపడ్డందుకని కంట తడిబెట్టాడుకూడా.

చెంచిగా, నీకు అంత డబ్బెందుకురా, ఆడి స్తనాడని
నువ్వు తీసుకుంటున్నావా, నిజంగానే కావాలా అనాక

మల్లా ఇచ్చుకునేటపుడు బరువవుద్దని నేను ఓ మూల నసిగాను. ఛెఛెస్ నీకేటి తెలుసు నా అవుసరం అని ఎగిరాడు. ఏడుకొండలుకూడా ఏమనుకున్నాడో మరి, ఔనే బావా, కొంచం ముందెనకలు చూసుకు మరీ తీసుకోడం మంచిది గాదా, ఆనాక ఈడిపేరేడుకొండలేగాని, వుట్టెదవనాయాల, కాబూలీజీబూతం అనగలవు. చూడుమరి అన్నాడు పరాసికంగా అన్నట్టు.

కాదుకూడదంటూ ఆవురుబావురని రొక్కంలాగేసుకు రొండిని దోపేసుకున్నాడు చెంచయ్య.

ఏమోలే. పిల్లా జెల్లా ఉండె. పైగా రొండుకాపురాలాయె. ఆడికేటి అవుసరమో మనకేల అని నే నూరుకున్నాను.

నేననుకున్నట్టే అయింది. వారం తిరిగేసరికి పెద్దామె అక్కాబత్తులవాడింటిమీదపడి దుమ్మెత్తిపోస్తోంది. చిన్నామెకి పట్టెడ పురమాయించినపుడు నాకేల జెప్పలేదూ అని. తరువాత సవుతులిద్దరూ తగవులాడుకున్నారు. నీకు పిల్లా జెల్లాలేరు, గొడ్రాలివి... నీకేం కులుకుతావు నీకు దోచిపెట్టే అప్పుల్తో నా కొంప గుండం చేస్తున్నాడు అంది పెద్దామె. ఆపైన ఏడుకొండల్నికూడా తూర్పారబట్టేసింది.

వింత జెబుతా విను. ఇంతపారూ అయేసరికి చెంచయ్యకి ఏడుకొండలమీద మనిషికొచ్చినంత కోపమొచ్చేసింది. ఈ యెదవనాయాల ఇయ్యాపట్టిగదా నే బుచ్చుకున్నా, దానిమూలానేగదా చిన్నమ్మికి పట్టెడ చేయించడం, పెద్దమ్మికి ఉసురు పెట్టడమూను అని ఆవాడ్డినా

ఆవాడనా అన్నాట్ట, ఏడుకొండలికి పౌరుషమేసుకొచ్చింది. న్నయాల నేనొద్దు మొర్రోఅంటే పేణం కడంటేలా పీక్కుతినేశాడుగదయ్యా అన్నాడు. కాని ఎంత రాక్షసుడైనా మంచిముండావాడేమో తమాయించుకున్నాడు. చెంచయ్యకి మట్టుకు కోపంపోలేదు. ఇంత వొంచనజేసి నన్ను పెడదారిన పెడతాడా. ఇలా ఎన్ని కొంపలు కూలిపోతున్నాయో అని నచ్చజెప్పుకున్నాడు.

అంచేత డబ్బు చేతి కందినరోజున ఏడుకొండలు గుమ్మానికొచ్చి పిలిచేవరకూ చెంచయ్యకి డబ్బు వదులుకో మనసు కాలేదు. మనసు నీరుగారిపోయింది. చచ్చి చెడి గడించిన డబ్బంతా ఈ డెదాన ఒక్కసారి గుమ్మరించడమేవిటని విసుక్కున్నాడు. ఆపైన మళ్ళీ ఏమనుకున్నాడో ఏం జాలిపడ్డాడో లేకపోతే ఏడుకొండలు కండలుచూసి ఇంకేమన్నా అనుకున్నాడో మొత్తానికి శాంతంగానే ఈవలకొచ్చి, కూచోమని దాహం అడిగి, కుశలంజెప్పి, బావా ఒక్కిన్నపం అన్నాడు.

ఏంది చెంచయ్యా అన్నా డేడుకొండలు కులాసాగా.

మరేంలేదుబావా. నగదేమో చేతికొచ్చినమాట రైటే నీకు తెల్సనుకో. కాని ఇపుడేగదా అందిందీ, ఇంకా సరిగ్గా లెక్కట్టికూడా చూడలేదాయె అంటంది నీ చెల్లెమ్మ అంటూ నసిగాడు.

ఏడుకొండలు నవ్వాడుగాని మాట జారలేదనుకో.

అయినా ఆ కాస్తనవ్వే దొరకబుచ్చుకొని పుంజుకున్నాడు. రెండ్రోలు ఇంట్లోవుంచుకుని నీది నీకు పువ్వుల్లో

పెట్టిచ్చెయ్యనా అందులో కానీముట్టుకుంటే ఒట్టు... మరేం లేదు. మాలచ్మి ఇలా కొంపలో అడుగుపెట్టిందో లేదో అప్పుడే మళ్ళగొడితే మనసు పీకుతాదని బుల్లెమ్మ ఇదవుతుంది అన్నాడు.

సర్లే. సీమాటే కానీయ్ అంటూ చెంచయ్య బుడ్డాడి బుగ్గ పుణికి, చేతిలో జీళ్ళపొట్టం వాడిచేతపెట్టి వెళ్ళిపోయాడు.

రెండ్రోజులు తరవాత మనింటిదగ్గర జతపడ్డారిద్దరూ. అపుడే బాకీ భాగోతం అంతా బాగా తెల్సిందన్నోడికి. ఏడుకొండల్ని చూడగానే చాటుకి పిలిచి, 'బావా నీ డబ్బు అలాగే ముడుగట్టుందయ్యోవ్! అన్నాడు చెంచయ్య తెచ్చిపెట్టుకు నవ్వి.

మరేమంటావు. నేను వచ్చేట్టా మాపిటికి నువ్వొచ్చేట్టా అన్నాడు ఏడుకొండలు.

మాపిటికే గావాలంటావా. పిల్లలు పెడతదేమిటి అన్నాడు చెంచయ్య చనువుదీసుకుని.

యాడవబోయి బావుండదని నవటాలంటే ఏవిటో ఏడుకొండలు మొగంచూడగా నా కానాడు తెల్సింది.

యాడాది రెక్కలకష్టంగదా, అందులో ఒక్క రూపాయి డబ్బులెట్టి పప్పూవణ్ణవూఁ సుబ్బరవైన కూరా చేసుకుదిన్న పాపాన పోలేదూ మన వేడత్తా ఇత్తే అన్నకి మటుకేవిఁ సుకవూఁ అంటదయా చెల్లమ్మా అని నసిగాడు చెంచయ్య.

ఏటో మీ చాదస్తాలు మరీ చిత్రంగున్నాయి అంటూ వెళిపోయాడు ఏడుకొండలు.

వారం తిరిగాక ఓరోజు మద్దినేళ చెంచయ్యింటికి వెళ్లాడు ఏడుకొండలు.

ఎండనిపడొచ్చావేటి సేపాలన్నాడు చెంచయ్య.

కొత్తవేటున్నాయిగనకా అన్నాడు ఏడుకొండలు గుంభనగా.

పాతవిమటుకేవున్నాయి అన్నాడు చెంచయ్య ఇంకా తొణక్కుండా.

...ఆడబ్బు కాకా...అని మాట జారేసింది బుల్లెమ్మ.

శాస్తరం జెప్పినట్టుంది, బావక స్వభావాను అదే జాసనుకున్నా వేటి మన్లాగ అన్నాడు చెంచయ్య...నవ్వినా పెళ్లాంకేసి కొరకొరజూసి.

మీ సంగతేవోఁ నా కెరుకలేదు గాని, నాకుమటుకు డబ్బుగావాలయ్యోయ్ అన్నాడు ఏడుకొండలు సిగ్గువిడిచి.

అంత మోటగా తీసుకుపోవద్దని బతిమలాడాడు చెంచయ్య. ఇంటో తెచ్చి పదిరోజులైనా ఉంచుకోకుండా యిస్తే మన సొప్పటంలేదన్నాడు. ఎలాగా ఇచ్చేసేదిగదా అన్నాడు. ఇంకొక పదిరోజులుంచుకోనీ అన్నాడు.

సరేనన్నాడు ఏడుకొండలు. పదివెళ్లాక పదకొండో రోజున అడిగితే, ఇవాళ సుక్కురారంగదా చూస్తూచ్చి మాలచ్మిని ఎలా పంపుకోను అన్నాడు.

శనివారంనాడు ఏడుకొండలు గుమ్మంలో కొచ్చే సరికి చూడనట్టు లోపల కూర్చొని తలుపేసుకుని, పెళ్లాన్ని పిలిచి, ఆ శనిగాడొస్తాడు డబ్బెక్కడుందో చూడమని గట్టిగా పురమాయించాడు.

ఏడుకొండలికి ప్రాణం సీరుగారిపోయి వచ్చిన వాడొచ్చినట్టే వెనక్కెళ్ళిపోయాడు.

ఆదివారంనాడు చెంచయ్య సంతకెళ్లాడు.

సోమవారంనాడు చెంచయ్య బుల్లోడు, ముంతెడు రూపాయిలూ కలబోసుకు ఆడుకుంటున్నాట్ట. వాణ్ని ఏడిపించడం ఎలా? సరే మంగళారం ఎలాగేనా మంగళారం గదా. బుధవారంనాడు మటుకు ఇదిగో పదబావా, నీ వెనకాలే వస్తున్నా, ఎంతేనా కష్టారితం చూడు అన్నాడు చెంచయ్య.

నాదిమటుకు కాదేటి. అప్పనంగా వచ్చిపడ్డ శాపతనుకున్నావా అన్నాడు ఏడుకొండలు.

అంతమాటన్నానా. శాంతపడు అన్నాడు చెంచయ్య నవ్వి—అప్పనంగా వచ్చింది అప్పలాళ్ళ కడుపుకొట్టి కొంపలార్పి, వడ్డీలుగా పోగేసిందీ కాకపోతే ఇది కష్టారితమూ ఏవిటని మనసులో అనుకున్నా. అందుకని తన కష్టారితం మీద జాలేసింది. పాపం అనుకున్నాడుకూడా. మొత్తానికి బుధవారంనాడు ఏడుకొండలు వెనకాలే డబ్బు మోసుకొస్తానన్నాడుగాని అంతపని చెయ్యలేదు. పిల్లాడు కబుర్లు చెపుతావుంటే సరదాగా కూచుండి పోయాడట.

లక్ష్మింవారం సుక్కురారం, శనివారం ఏడుకొండలు అటువే పెళ్ళనేలేదు. ఆదివారంనాడు చెంచయ్యే కబురెట్టాడు ఏడుకొండలికి... ఒక్కసారి చూసిపొమ్మని.

ఒంట్లో నలతగా ఉందిబావా. పులపరం తగిలిం దంత కన్నేం లేదని బుల్లెమ్మందిగాని ప్రాణం బేజారుగాఉంది నేనే పైకం తెద్దామనుకొన్నాను, గాని వొల్లనయింది గాసు అన్నాడు చెంచయ్య నీరసంగా.

ఏడుకొండలికి తలకొట్టేసినట్లయింది. ఇన్నాళ్లూ అందరూ అందరితోపాటుతనూ, తనని యములాడనన్నా నవ్వేసేవాడు. ఈసారి నిజంగానే తను యముడు అయినట్టనిపించింది. ఆ రోజుల్లో ఉండుండి మీసం తడుముకునేవాడు. దున్నపోతుకీ బర్రెలకీ దూరంగా నిలబడేవాడు.

అలాగే కానీ అన్నాడు దిగులుగా.

మరేంలేదు. కొంపలో నాలుగురాళ్ళున్నాయన్న ధీమాచూడూ, అదే పదిమందులపెట్టు. పత్తేం దినగానే... అన్నాడు చెంచయ్య.

పదిహేమురోజులిగ్గాని పత్తెందిన్నట్టు పబ్లికున ఒప్పుకున్నాడుగాదు చెంచయ్య.

ఈలోగా ఏడుకొండలు డబ్బుకి రొక్కసంపడ్డా నోరు మూసుకున్నాడు.

ఆ తరవాత అతను నోరెత్తినరోజుని చెంచయ్య గజగజలాడిపోయాడు — మార్గశిరమాసంలో గోదాట్లో స్నానం జేసినాడిలా.

అంతలా నోగుపారేసుకున్నందుకు ఏడుకొండలికే మళ్ళీ మనసెలాగోఅయిపోయి శాంతపడి ఇంటికెళ్లి పోయాడు.

మర్నాడు, అతన్ని వాకిట కూచోబెట్టి చెంచయ్యా, బుల్లెమ్మా చెరో వెంపూ జేరి ఓదార్చారు. మరేం పరవా లేదు. తిడితే తిట్టావు. మేం కోపంజేసుకోంలే అన్నారు. నువ్వుగాకపోతే మరెవ్వరు తిడతారన్నారు. మరోడు తిడితే ఊరుకుంటామా అన్నారు. ఊరుకునేది లేదనికూడా ఖచ్చితంగా చెప్పేశారు. ఆనక చెంచయ్య డబ్బుసంగతికూడా మెల్లిగా నచ్చచెప్పాడు.

ఏడుకొండలికి వెంటనే ఆ నాలుగొందలూ ఇవ్వడానికి అభ్యంతరం లేనిమాట నిజమేట. కాని అంత దూకుడుగా వెళ్లి ఆ నాలుగొందలూ చక్కబెట్టే రాచకార్యాలేముంటాయిగనుక. చేసే నిరవాకం ఏముంటుందిగనుక. అవేమన్నా పిల్లలు బెడతాయా. ఆమాటకొస్తే ఓ నెల్లాళ్ళపాటు ఇందమ్మాలే తన ఇలాకాలో ఉంటే పాతికా, పరకా వడ్డీవస్తే పిల్లలకీ బట్టాపాతా కొనవచ్చు. ముసల్ది మూడేళ్ళమట్టి సణుక్కుంటోంది. ఓ కొత్త గొంగళీ కొని దగలెయ్యమని. అందుకని, మొన్నే—డబ్బు ఇంటో ఊరికే పడుంటే ఎవడు దిన్నట్టని—మొన్నంటే మొన్న ఒహ కావలసినాయనికి సర్దాడతను. మళ్ళీ నెలతిరక్కుండా తిరిగొచ్చేస్తుంది పైకం. అవతలివాడు చాలా పెద్దమనిషి. మరోడూ మరోడూకాడు. అన్నవేళకి తప్పకుండా జను

చేసేస్తాడు. దేవుడంటే నమ్మ ఏడుకొండలూ అంటూ జరిగిన విషయం చెప్పుకొచ్చాడు.

ఏడుకొండలికి మధ్యలో ఓ చోట కోపం వచ్చింది. ఓచోట దుఃఖం పొర్లిపోయింది. ఇంకోసారి ఖూనీచేద్దామని బుద్ధి పుట్టింది. ఓసారి తనే పొడుచుకు చద్దామని, అందుకు ముందో వెనుకో ఈ చెంచయ్యగాడికి అప్పిస్తానన్న నాలికని తెగ్గోసేసుకోవాలనీ మనసైంది మరోసారి ఆలుమగలిద్దర్నీ వేలాంపాడి పారెయ్యాలనిపించింది. చివరికి జరిగిందిమాత్రం భోరున ఏడిచి నెత్తికొట్టుకుని ప్రాణం చాలొచ్చికుప్ప కూలిపోవడం. ఆలుమగ లిద్దరూ అతన్ని పోగేసి లేవదీసి కుదేసి మంచినీళ్ళిచ్చి పంపేశారు దప్ప డబ్బు ఇవ్వలేదు. ఇచ్చేందుకు డబ్బులేకనా అనడగవేం ? డబ్బేమో ఉండె.

కాని రెక్కలార్చి గడించినదాన్ని ఈ యములాడి ఎదాన గొట్టడానికి చేతులు రాలేదు. వాళ్లుమటు కేంజేస్తారు. అప్పుతీర్చే డబ్బు అలాటిదాయె. తీర్చేటప్పుడు ప్రతి మనిషికీ మనసలా ఉండునాయె.

నువ్వు గావాలంటే ఓసారి మన చిత్రాబుక్కుచూడు.

బదులు దీసుకున్న పైకాన్ని అసలసలుగా మొత్తంగా జమ కట్టిన కాతా లెన్నున్నాయో లెక్కెట్టిచూడు. వంద బుచ్చుకున్నవాడికి, వందా చచ్చినా ఇవ్వడానికి చేతు ల్రావు. తొంభై ఇస్తాడు. పదీ ఆనక పంపుతా బాబాయ్ అంటాడు. ఇంతడబ్బు నీ ఎదాన కొడుతూవుంటే వెధవ పదిరూపాయలకి ఏడవక్కర్లేదులే అన్నట్టు ఆనక ఆపది ఏదిరా అని నువ్వం అడిగిచ్చేనూ వాడిచ్చిజచ్చాడా.

చిన్నదయిపోయె. ఏదిరా అని అడిగితే మనం నూగింజకి నాలుకజాపే దరిద్రులం అయిపోతాం. అడక్కపోతే ఆ మాటేనా ఉందా. మళ్లీ అప్పుకొచ్చినపుడు నీ పాతబాకీ అణాపైసల్తో పారేశా కావాలంటే చిత్తాజూసుకో అంటాడు పదుచ్చుకున్నవాడు అందులో రెండుకో మూడుకో నామం బెడతాడు. ఇదీ మనకి దక్కేవడ్డీ.

*　　*　　*

ముసలాడు పొద్దున్నే కూచోబెట్టి ప్రాణం తోడేశా డనుకునేవు, ఊరికే లోకమ్మీద సంగజెప్పాను. నీ జతగాడు మంచివాడే కావచ్చు. కాని సంగతదీ. బాకీ తీర్చేటప్పుడు డబ్బు విదల్చడానికి ఓ పట్టాన ప్రాణం వొప్పదు. ఇదన్నా డబ్బుఉంటేగింటేమాట. అసలు చేతికే డబ్బురాకపోతే ఇంకెంత అవస్థో చూసుకో.

ఇంతకీ ఏడుకొండలు చెంచయ్యదగ్గిర ఆ బాకీ ఎలా వసూల్జేశాడంటావు ? అన్నాడు మునసబుగారు.

ఏమో తెలీదే నాన్నా అన్నాడు దుర్మార్గం.

ఆలోచించిచూడు.

నాకు తెలీదే. నీకు తెల్సా ?

నాకు తెలీదు. అసలు వాడు వసూలే జెయ్యలేదు. ఏడుకొండలు అవసరాన్ని బట్టి, "నేనెరిగిన పెద్దమనిషి దగ్గిర ఋణమిప్పిస్తాను పట్టు అంటూ మూడోమనిషి ద్వారా ఐదొందలు నూటికి నెలకి రూపాయి వడ్డీచొప్పున నోటురాయించుకు ఇప్పించాడు చెంచయ్య. నోటు

మాటవరసకే అన్నాడు. వడ్డీ నేను సర్దేస్తాలే అని మాటవరస కన్నాడు. ఏడుకొండలికి తను బాకీ ఉన్నది అలా ఫిరాయించేస్తాననికూడా మాటవరసకే అన్నాడు. ఏడాది తిరిగే సరికి, కోర్టునుంచి సమన్లొచ్చాయి. నోటువరసమూలంగా ఏడుకొండలు రాద్ధాంతం చేసి, నువ్వే పోయిచ్చుకో అన్నాడు చెంచయ్యని. నాకేంపట్టె మధ్య, నే న్నిబొమ్మర్ది ననుకున్నావా పోవోస్ నీకన్నా మొనగాళ్ళను చూశాం అని గసిరిపారేశాడు చెంచయ్య.

ఏడుకొండలు మాట అలా తూలకపోతే తాను సర్దే వాడేనట. చివరకి ఎక్సుపార్టీ డిక్రీ అయిపోయింది దావా. అమీను గుమ్మాన నిలబడేసరికి అనూ మినూ అనకుండా ఐదొందల అరవై కరుకులూ, కోరటు ఖర్చులూ పైగా అమీనుగారి ముడుపూ చెల్లించుకున్నాడు. తరవాత ఏడు కొండలు మళ్లీ మనిషవలేదు.

మరినువ్వు సాక్ష్యం ఇవ్వలేదా? ఇలా ఏడుకొండలు చెంచయ్యకి బదులివ్వగా చూశాను_అని ? అని గుర్నాథం తండ్రిని అడగలేదు.

అడిగినా, చెంచయ్య ఆ బాకీ తీర్చలేదనడానికి మటుకు సాక్ష్యమేముందిటా అని తండ్రి అంటాడని అతనికి తెలుసు.

ఇలాటి ప్రశ్నలు అడిగరానివనికూడా లోగడ ఇలాటి ప్రశ్న వచ్చినపుడు ఆయన చెప్పాడు. ఎందుకో ముందుముందు నీకే తెలుస్తాయిలే అన్నాడు.

* * *

సరే నాన్నా వాణ్ణోసారి అడిగొస్తాను. మళ్లీ బాకీ తీర్చడానికి నీకు డబ్బెక్కడనుంచి వస్తుందీ, ఎంతవస్తుందీ అని కనుక్కుంటాను. వాడిచేతి కెంతొస్తుందంటే అందులో సగమివ్వచ్చునేమో. అప్పుడు బాకీతీర్చడానికి అట్టేబాధగా ఉండదుగదా అన్నాడు గుర్నాథం.

నీయిష్టం నాదేముంది అన్నాడు మునసబుగారు.

*　　*　　*

సుబ్బన్న అప్పారావు కథను ఆపి బుస్సురని నిట్టూర్చాడు.

## చీమా పాముల సంవాదప్రకారము

చీమల సింహాద్రి కళ్ళు పెద్దవిచేసి చూసి ఏమయ్యిందో విచారిస్తున్నాను. చివరికి అప్పారావుకి గుర్నాథం ఆ అప్పు కాస్తా ఇచ్చేస్తాడని బాధగా ఉందా అన్నాడు.

నాగలక్ష్మి విసుక్కుంది

సుబ్బన్న మొగలిపొదల మీదనుంచి వచ్చినగాలి మటుకు అల్పాహారంచేసి మిగతాది నాజూగ్గా వదిలేసి, స్తిమితపడి నవ్వాడు.

అబ్బీ మీకేం చల్లగా గుట్టుచప్పుడు కాకుండా నా పుట్టలో దూరి కూచుని పుట్టని అప్పెడతావా అని బేరాలు పోతారు. అప్పెట్టడం ఎంత ముప్పో మీకేం తెలిసేను. చీవంత చింతలేదు. తీసుకునేవాడికి ఇచ్చేవాడికి బాధ బోధపడేదెలా ? అన్నాడు సుబ్బన్న.

సింహాద్రి చిన్నబుచ్చుకున్నాడు. అబ్బీ సుబ్బన్నా అదేపనిగా అప్పులు చెయ్యడం మాకేం సరదాకాదు.

అసలు తీరికా లేదు. ఇవాళ మీారు ఇచ్చారు గదా అని మేము తీర్చకా పోము; తీర్చాం గదా అని అదేపనిగా అడగనూ అడగము, అడిగిన కొద్దీ ఇస్తున్నారని రేటు నానాటికీ పెంచనూ పెంచము. అప్పుడు, అప్పడికథలా అసలుకే మోసం వస్తుందని తెలుసు.

అప్పడి కథేమిటి? అసలుకే మోసం ఏమొచ్చె అంది నాగలక్ష్మి.

తా నెరిగిన తాళపత్ర గ్రంథాలలోని అప్పడి కథను అప్పుడు సింహాద్రి ఇలా చెప్పాడు :

## అప్పడి కథ

పూర్వము అప్పడని ఒకడుండెనూ. ఇద్దరు ఉన్డుటకు వీలులేకనే వక్కడు వున్డెనూ. వానికి డబ్బుగల స్నేహితుడూ గలడూ. అందువల్ల డబ్బు లేదూ. అందువలన స్నేహితుడు అప్పడికి మొహమాటాలుచే ప్రతిదినమూ వక వరహా బదులు ఇచ్చుచుండెనూ. ఇట్లుండగా వక దినమున అప్పడు ఇట్లాలోచించెనూ; వీడు నాకు రోజు రోజూ వడ్డీ వరహా యిస్తు వుంణ్ణాడు గదా. వక్కసారే వంద ఎందుకు అడగరాదూ. వీడు ఇవ్వారాదూ. ఇట్లా యోచించి అట్లా అప్పడు మిత్రుడిని వకరోజున వక్కసారిగా వంద వరహాలు అడిగెనూ. వాడు వెంటనే నావద్ద అంత డబ్బు లేదుగదా ఏమిచేయుదునూ అని యోచించి, ఓకీ అప్పడూ నావద్ద లేదు అని చెప్పివేసెనూ. మొహమాటమూ పోయింది గావున మరునాడు కూడా వక వరహా యివ్వలేదూ... అని కథ ముగించాడు చీమల సింహాద్రి ఆయాసపడుతూ.

## బాతు పరిహసించుట

ఆ దారినపోతున్న బాతు, సుబ్బన్నకి దూరంగా ఆగి బక బక నవ్వి, ఈ సింహాద్రిగారు మన కథలనే మనుష్యుల మీద అల్లి తమాషాగా చెబుతున్నారు అని తమాషాగా నవ్వి, నాగలక్ష్మి బుస్సుమనేసరికి తుర్రున పారిపోయింది.

## ఋణాన్నభుక్కుల కథ

ఔను. దురాశ దుఃఖానికి చేటు అన్నాడు సుబ్బన్న. పూర్వమొక ఋణాన్నభుక్కు ఇలాగే తిరిగి తిరిగి ఎక్కడో ఒకచోట ఒకమాడ అప్పు తెచ్చుకుని మూడు ఝాముల వేళ ఇంటికి పోతూ, రాజవీధి మొగలో దూరంగా ఋణాశనుడనే వాడినీ, వాడి మొహాన్ని చూసి వాడికి కూడా ఆనాడు ఓ మాడ దొరికి ఉంటుందనీ, తను తన ఇంటి బాధను మరొక్కసారి ఏకరువు పెడితే ఋణాశనుడి రొండిలో ఉండగల మాడలో సగబాలు అప్పు సంపాదిస్తే, మర్నాడు తనకి వేతనం రాగానే తీర్చిపారెయ్యొచ్చునీ ఆశపడి పనిమల్లె ఋణాశనుడికి ఎదురేగి పలకరించి తన పాచిక వేయబోయాడు, ఆ వరకే ఈ వాయినం పసిగట్టిన ఋణాశనుడు ఇతనికన్న ధాటీగా దుఃఖించి, తాను ఇవ్వకపోవడమే కాక, ఋణాన్నభుక్కు గొండిన వున్న మాడా కూడా అప్పుగా వడేసి పుచ్చుకు తన దారిన పోయాడు అన్నాడు సుబ్బన్న.

ఈ కథ లాలకించిన చెట్టుమీద కాకి మటుకు కావు కేక పెట్టి, అయితే ఔ గాక, మహా చక్కటి నీతి కథలు గదా, సుబ్బన్నగారూ మీరేం అనుకోకండి గాని, నామాట

విని మీ పుట్టని అప్పివ్వండి. మళ్లీ వాళ్ళు కాళీచేసి ఇచ్చేస్తారు అని ఊరుకుంది.

చీమలూ పాములూ పైకి చూసి నవ్వుకున్నాయి. ఒకటి రెండు జాలిగా కూడా చూశాయి.

## ఋణకేతుని కథ

కాక రాజా! నీ మాటే కాక వ్యూహ కూడా మంచిది కాదు. అలా పరాయి గొడవల్లో కలుగచేసుకోరాదు. నువ్వే చిక్కుల్లో ఇరుక్కుంటావు.ఋణకేతుడులా. జాగ్రత్త అంది నాగలక్ష్మి వెటకారంగా.

ఎవరా ఋణకేతుడు ? అన్నాడు సుబ్బన్న భార్య వంక చూసి.

నాగలక్ష్మి ఆ కథ చెప్పింది.

పూర్వము ఋణవ్రతుడు అనే వాడొకనాడు ధనస్వామి అనే శ్రేష్ఠిని అప్పడగబోయాడు. ధనస్వామి లేదంటున్నాడు, ఇతను ఇవ్వమంటున్నాడు. దారిని పోయే ఇంధనస్వామి వీరి తగాయిదా చూసి పలకరించి ఏమయ్యా మా ఋణస్వామి మహా యోగ్యుడు గదయ్యా,బుద్ధిమంతుడు గదయ్యా.అతనికి అప్పివ్వడానికి సందేహమేల అన్నాడు నవ్వుతూ. ధనస్వామి కోపగించుకొని నేనలా కళ్లు మూసుకుని అప్పులివ్వలేను. అంత నమ్మకం ఉంటే నువ్వేఇవ్వరాదా అన్నాడు. ఓ ఎందుకివ్వనూ అనేశాడు ఇంధనస్వామి కళ్లు మూసుకునే. అవి తెరవగానే కటుక్కున నాలిక్కరచుకొని, అదీ, అప్పుడే ఆ దారిన అమ్ముొచ్చిన గంపలో పచ్చి వెలక్కాయా కలిపిమింగేసి

గుడ్లు మిటకరించి "చేతనైతే డబ్బు లేదుగాని" అని - సాగదీశాడు.

దానికేముంది నీక్కావాలంటే నేను అప్పిస్తాను. నిన్ను నమ్మగలనుగా అంటూ ధనస్వామి ఇంధనస్వామికి అప్పిచ్చాడు. గత్యంతరం లేక ఇంధనస్వామి దానిని ఋణకేతుడి చేతుల్లో తగలేశాడు. అది ఇంక మళ్లీ రాదని సలహాయిచ్చే ముందే తనకు తెలుసు. కాబట్టి ఇంటికెళ్తూనే అంగరఖా విప్పి బోరున ఓ యేడుపు ఏడిచి ఊరుకున్నాడు. కాబట్టి ఓ కాకరాజా ఖబర్దార్ చెట్టుమీంచి నీ గూటికే మోసం రాగలదు అంది నాగలక్ష్మి.

కాకరాజు భార్య కంగారుపడి కావురు బావురని ఏడ్చి నాగలక్ష్మిని బతిమాలుకుంది. నా తల్లి. తల్లి పిల్లలవాళ్ళం. అలాటి పనులు చెయ్యకండి అంది. అని, మొగుడి డొక్కలో రెక్కతో పొడిచింది. రెక్కాడితేగాని డొక్కాడనివాళ్ళం. మనకీ రభసలేల ? నీవు పోయి పిల్లలకి మేత పట్రాకుండా కాకమ్మ కబుర్లు నువ్వూను అని మందలించింది.

తరవాత ఓ రెండు నిముషాలసేపు నిశ్శబ్దం గంభీరంగా ఉపన్యసించింది.

ఇంతకీ ఏమంటారు? పుట్ట కాళీ చేస్తారా లేదా అంది నాగలక్ష్మి కర్కశంగా.

చిత్తం తమరలా అంటే ఎలా. కాళీ చెయ్యాలన్నా లక్షలకొద్దీ ఉన్నాం కాబట్టి వ్యవధి పడుతుంది. ఈలోగా

మీరు తొందరపడితే కుట్టి చంపేస్తాం.గాన గ్రహించగలరు అన్నాడు సింహాద్రి.

కాపోయినా, పదికాలాలు మనకి అప్పిస్తే వీళ్ల పుట్ట మునుగుతుందా. నిజంగానే రేపు వరదలొచ్చి పుట్ట కొట్టుకు పోతే ఏంగాను ఋణతిలకుడి డబ్బులా అంద్ కుర్ర చీమ.

## అడగని కథ చెప్పుట

ఏమా కథ అని ఎవరూ అడగలేదు. అందుకని తనే చెప్పేసింది.

ఋణతిలకు డనువాడు తన దగ్గర డబ్బుని అంతా అప్పులడుగుతారని భయపడి పెరట్లో గోతిలో దాచుకోగా, దానిని దొంగలెత్తుకుపోగా, మర్నాడు వాడేడుస్తూ ఉండగా వాడిని క్రితం రోజునే అప్పడిగి లేదనిపించుకున్న అప్పన్న వచ్చి పకపక నవ్వి ఓరీ నువ్వు నాకు నిన్న అప్పు ఇచ్చిఉండి నట్లయితే దొంగతనం జరిగినా నీ డబ్బంతా నేను అచ్చు కొనే వాడిని గదా అని పకపక నవ్వి వెళ్ళిపోయెను. అని ఒక్క గుక్కలో కథ ముగించి అమ్మయ్య అయిపోయింది, అందా కుర్ర చీమ.

## గడసరి కథ

సింహాద్రి వాత్సల్యంతో, కొంచెం ఓరిమి నటించి మరీ నవ్వి, పిల్లవాడు చెప్పింది నిజమే. నా పాత జన్మల్లో ఓ సారి ఒకడిలాగే ఊరిమీద బందిపోట్లు రేపో మాపో పడు

తున్నారని తెలిసి తక్షణం, తన డబ్బుని అడిగిన వాడికి అడగని వాడికీ కూడా అప్పులిచ్చేసి ఋణపత్రాలు రాయించుకొని అవి ఓ పెట్టెలో భద్రపరచుకు కూర్చున్నాడు. మూడోనాడు దొంగలు రానే వచ్చారు. దోపిడీ చెయ్యనే చేశారు. నాలుగోనాడు నా మిత్రుడు ఉప్పొంగిపోతూ ఊరేగి, నా బాకీలు తీర్చండి అని రభసచేశాడు. దొంగలు కొల్లగొట్టారు. ఎక్కడ తెమ్మన్నావు అని వాళ్లంతా మొత్తుకున్నారు. ఆ మాట న్యాయాధికారికి చెప్పుకోండి నేను అభియోగం తెస్తున్నా మీమీద అంటూ, అతడు ఉత్సాహంగా ఇంటికెళ్లి ఋణపత్రాలు తీసుకోబోయాడు. అని సింహాద్రి ఆగాడు. కాబట్టి అప్పులు, ముప్పులు నివారించే శ్రీరామరక్షలుగదా అన్నాడు.

అలాగేం? ఆ తరువాత కథ నాకు తెలీదనుకున్నావా అంది నాగలక్ష్మి వెటకారంగా ... సుబ్బన్న ఆమె వంక కుతూహలంతో చూశాడు.

## గడసరి కథాంతము

గుర్తు లేదూ. నువ్వే ఆ జన్మలో ఈ పని చేసిన వాడివి తీరా ఆ రోజున నువ్వు ఋణపత్రాలు చూడబోయేసరికి అవి లేవు. బందిపోటు దొంగలు దోపిడీ హడావిడిలో నీ యిల్లు కొల్లగొట్టి ఋణపత్రాల పెట్టె చూసి అందులో డబ్బుంటుందని పొరపడి అది పట్టుకుపోయారుగదా. అందుకే నువ్వు కోరుకెళ్లలేక పోయావు. అప్పులివ్వకుండా ఉంటే. అయ్యో నా డబ్బు దోచుకుపోయారు అని అందరితోపాటు సమానంగా ఉత్సాహంగా ఏడ్చి, ఎవరిదగ్గరేనా సాయం సంపా

యించేవాడివి. అప్పు లివ్వడంవల్ల ఆఖరికి ఆ యేడుపుకికూడా సదుపాయం లేకపోయింది. అంచేత ఇపుడు ఈ పుట్ట యివ్వద్దు. కూలిపోతే హాయిగా ఏడుద్దాం అంది నాగలక్ష్మి.

మీరు ఇలా హఠాత్తుగా కాదంటే ఎలా? మీరు కాదనరన్న ఆశతో మేము ఇందులో దిగాం కదా. మూడు పూటలు గడువివ్వండి ఖాళీచేస్తాము అన్నాడు సింహాద్రి.

సుబ్బన్న మందహాసం చేశాడు. అప్పు దొరుకుతుం దన్న ఉత్సాహంతో గాలిపుట్టలు కట్టుకోడం చాలా పొరబాటు. —ఐదారు జన్మల తరువాత నువ్వు గాలిమేడ కట్టబోయినట్టు అన్నాడు.

సింహాద్రి గుండె గతుక్కుమంది. నేనింకా ఐదారు జన్మలెత్తాలా?

ఐదారేంఖర్మ... జన్మజన్మలా క్రాటోవర్లు సర్దుబాటై ఇచ్చి పుచ్చుకోడాల్లో బేరీజు సరిపడేదాకా ఇదేపని.

ఐతే అప్పుడు నేనేం చేస్తాను? ఏమవుతుందీ అన్నాడు సింహాద్రి.

**భవిష్యజ్జాతక కథలు**

అవడానికేముంది. నీ దగ్గిర మామూలుగానే డబ్బుండదు ఇప్పటిలాగానే అప్పుడూ అప్పులు చేస్తూ ఉంటావు. అప్పుడు, ఓరోజున గబగబా అప్పులన్నీ తీర్చి అవతల పారెయ్యడమేగాక, అప్పుల వాళ్ళందరి మొహాలూ బద్దలయ్యేలా విసిరికొట్టి, వాళ్ళకి ఎదురప్పులుకూడా యిచ్చి ఏడిపించేటంత ధనికుడివి కావాలన్న దురాశకొద్దీ ఓరోజు

పొద్దున్నే మంచిమాట చేసుకుని, చిన్న లక్షాధికారింటికి వెళ్ళి ఐదొందలు అప్పుతీసుకుని, పెద్ద కోటీశ్వరుడింటికి బయలు దేరుతావు. ఓ షిర్లాగారింట చేబదులు అడగాలని వెళ్తూంటావు. ఆరోజున షిర్లాగారు కారునచ్చక సరదాకి రిక్షా మీద కొంచెం దూరం వెళ్తారు. రిక్షాకి కూలి ఐదొందలివ్వ డానికి చిల్లర లేక, లక్షరూపాయల నోటుకి చిల్లర దొరక్క "వాట్" అనుకుంటూ వుంటారు. ఛేంజి నా దగ్గరుందని అందాకా ఆపక్కనేఉన్న నువ్వు ఆ డబ్బులిచ్చి రిక్షాని పంపేస్తావు. ఆనక ఆయన నీ ఫ్రెండయిపోయి, ఎప్పుడేనా లక్షో కోటీ ఇబ్బందయితే మొహమాటపడకు పుచ్చుకో అంటాడు. అంటూ ఓ కోటిస్తాడు ఇంకోటిమ్మంటావు నువ్వు. గంటసేపట్లో అప్పు తీరుస్తా నంటావు. ఆ రెండుకోట్లూ ఇలా ఆ గంటా పట్టుకునేసరికి ఊళ్ళో పలుకుబడి దారుణంగా పెరిగిపోయి పెద్ద-డబ్బు-గాడిలో పడిపోతావు. అప్పుడు ఖంగారులో షిర్లాగారే నీ దగ్గిర పదీ పరకా లక్షలు అప్పు తీసుకుంటాడు కూడా.

ఈ విధంగా ఆలోచించు కుంటూనే ఓపక్క అప్పుల వాళ్ళకు అంకకుండా, వాన చినుకులమధ్య నకులుడు గుర్రం తోలినట్లు నీ చేతిలో డబ్బు పట్టుకు వెళ్తూవుంటావు. అయితే నీ కల, పతాక సన్నివేశానికి వచ్చేసరికి, ఆ కలలో నీ చేత డబ్బును ఏ బిర్లావో అడిగాడనుకొని అందించ బోయినట్టు పట్టుకుంటావు. అపుడు ఎక్కడినించో అప్పారావు వచ్చి రెండొందలు చేబదులు తీసుకుని, నీ దగ్గిర డబ్బుందని గాలిలో ఊదేవరకూ, అప్పులవాళ్ళు వడగళ్ళలా వచ్చిపడి

ఉన్నది ఊడ్చుకపోతారు.

ఓ సింహాద్రీ! ఇపుడూ ఆబుద్ధే ప్రదర్శించి దొరక బోయే అప్పును నమ్ముకుని నాపుట్టలో ప్రవేశించావు. గాన తెలుపడమైనది అని సుబ్బన్న ఊరుకున్నాడు.

సింహాద్రి తెల్లబోయి తేరుకుని సెహబాసు. ఔను గాని, సుబ్బన్నా నీ కెలా తెలుసు ఇవన్నీ, ఈజన్మలూ ఫిరాయింపులు కథా కమామిషూనూ? అన్నాడు.

నీవు నేర్పిన విద్యయే అన్నాడు సుబ్బన్న వినమ్రత ఉట్టిపడేలా.

నాగలక్ష్మికి ఈవరసచూడగా ఒళ్ళుమండింది. బావుంది నీ వినయం నుప్పూ. ఆనక కథయ్యేటపుడు అంతా కలిసి ఫొటోగ్రాఫు దిగుదురుగాని గాని, ముందర వాళ్ళని లేవగొట్టు అంది భర్తతో.

ఓ నడికారుచీమ, గొంతు సవరించుకుని కలగజేసు కుంది. అయ్యా సుబ్బన్నగారూ అలా చెప్పుడుమాటలు వినరాదు చెడేరు.

## రష్యాలో రామయ్యకథ

పూర్వము రష్యాలో రామయ్య అనే రైతు ఉండే వాడు. ఓ మాయదారి నూరయ్యకి ఓ నాలుగొందలు అప్పే వ్యాజానికి ఒడిగట్టి, మర్నాడు పంచాయితీ దగ్గరకొస్తే కాయి తం రాసుకు నగదు పుచ్చుగుందుగాని రమ్మన్నాడు. మారయ్య అప్పులు తీర్చడని భయపడ్డ నలుగురు దురాత్ములు ఇది తెలిసి పంచాయితీఆఫీసు అరుగుముందు రామయ్య ఒక్కడూ కూర్చునిఉండగా చూసి కొంచెం

ఆసింటా కూర్చుని, ఈవూళ్లో ఎవరో వెర్రివెంగళాయ మారయ్యని నమ్మి అప్పిస్తున్నాట్ట. అంతకన్న డబ్బుని గోయితీసి కప్పెట్టుకోరాదూ అని విడివిడిగా రామయ్యకి వినబడేలా అనుకుని లేచి చక్కా పోయార్ట. వరసగా ఇలా నలుగురు అనుకునేవరకు రామయ్యకి మతిచెడి, అతను రాగానే నేనివ్వనని చెప్పి లేచిపోయాట్ట. అప్పుడు ఊరివారూ మునసబూ అంతా సంతోషించార్ట. రామయ్యకి గొప్ప ప్రమాదం తప్పింది. చెప్పుడుమాటలు వినడంవలనేగదా ఆహా! అనుకున్నారుట.

చీమ హఠాత్తుగా కథ ఆపేసి చుట్టూ చూసింది. మిగతా చీమలన్నీ తన కేసి భయంకరంగా చూస్తున్నాయి. నాగలక్ష్మి, సుబ్బన్న విరగబడి నవ్వుతున్నారు.

చీమ నాలిక్కొరచుకుంది. ఓహో తప్పుకథ చెప్పాను కాబోలు. లేదా కథ తప్పుచెప్పి వుంటాను. పొరపాటు అంది.

కథేకాదు. నువ్వు మాటాడడమే పొరబాటు. అసలు నువ్వే పెద్ద పొరబాటు అన్నాడు సింహాద్రి కోపంగా.

## గరుడ దర్శనం

సుబ్బన్నా నాగలక్ష్మి ఇహ లాభం లేదని కూడబలుక్కుని పడగలుదించి పుట్టమీదికి బయల్దేరబోయారు. చీమలన్నీ, వాటిభాషలో హాహాకారాలు చేశాయి. అంతలో చూస్తూ ఉండగా సుబ్బన్నకి కొంచెం ఎదరగా ఓ పెద్దడేగ నీడపడి, ముందుగా సాగిపోయింది. బాబోయి అంది నాగలక్ష్మి పైకిచూసి.

అప్పులవాడులా వుంది అన్నాడు చీమల సింహాద్రి నవ్వుతూ.

సుబ్బన్న మాటాడలేదు. నాగలక్ష్మిని వెంటేసుకుని పక్కనేఉన్న పొదలోదూరి కూర్చున్నాడు. ఇపుడుగనక చీమలన్నీ ఇవతలికొచ్చేస్తే, అది పైనించిచూసి, ఇక్కడేదో ఫలహారం ఉందని కిందికి దిగుతుంది అందినాగలక్ష్మి.

అయ్యా సుబ్బన్నగారూ మీరు చాలా అద్భుతమైన నికుంజంలో ప్రవేశించారు అదృష్టవంతులు. ఇపుడపుడే షికారు వెళ్ళరుకాబట్టి అప్పారావుకథ ముగించేస్తారా? అతనికి మునసబుగారు అప్పిచ్చినటా లేనట్టా అన్నాడు సింహాద్రి.

పొద మాట్లాడలేదు.

పోన్లెండి మీరు చెప్పకపోతే ఆ కథేదో మిగతాది నే చెబుతా పట్టండి అన్నాడు సింహాద్రి.

## అప్పారావను సుబ్బారావు యొక్క మిగతా కథ

ఆ విధంగా అప్పారావుకి బాకీ తీర్చేసత్తా ఉందో లేదో కనుక్కొస్తానని తన కుమారుడు గుర్నాథం కదలగానే, మునసబుగారుకూడా లేచి ఆగరా అబ్బీ నేనూ వస్తా. అటేపే పనుంది, అంటూ వెంట బయల్దేరారు.

ఈవిధంగా వారు వెళ్తూండగా, గజ్జెలగుర్రం వంటి ఓ చిన్నది కడవ చంకనబెట్టినది వయారంగాపోతూ ఎదురయే వరకూ, అదృష్టవశాత్తు గుర్నాథానికి ఎరిగిన మనిషొకడు తటస్థపడగా, నువ్వు పద నాన్నా అంటూ ఒక్కడుగు

ఆగాడు గుర్నాధం. ఈలోగా నాలుగడుగులు ముందుకు వేసి వీధిమళుపు తిరిగి శివాలయం చేరబోయేసరికి మున సబుగారికి సుబ్బారావు అని ఒక ఋణగృహీత కనుపించాడు. అతడు ఆయనకు ఐదొందలు ఇవ్వాలి. నిన్ననో మొన్ననో జమ పెడతానన్నాడు. సరే ఇతగాడిస్తే, తను సుపుత్రుడి మిత్రుడికి ఈ పైకం ఇలాగే ఫిరాయించేయొచ్చునని ముచ్చట పడి మునసబుగారు అతనిదరి చేరబోయారు.

వారిని చూడగానే అప్పారావునకు గుండె గుభేలు మంది. అయితే అతను ఉపాయాలపుట్ట కాబట్టి కర్తవ్యాలు ఎరిగినవాడు. కాబట్టి ఆదారినే బడికిపోతున్న పిల్లల్ని చూసి అందులో ఒకణ్ణి ఆప్యాయంగా ఎత్తుకు ముద్దాడబోయాడు.

వాడు మావాడు కాదు అన్నారు మునసబుగారు చిరునవ్వి.

అప్పారావు ఆ పిల్లాణ్ణిపడేసి మందలో ఇంకోణ్ణి ఎత్తు కొని ముద్దాడి ఆయనవంక చూశాడు.

వీడూకాదు అన్నాయి మునసబుగారి చూపులు. వెంటనే అప్పారావు వాణ్ణి పారేసి ఇంకోణ్ణితీసి, ముద్దాడే ముందు ప్రశ్నార్ధకంగా చూశాడు.

వద్దు అన్నాయి మునసబుగారి చూపులు.

అప్పారావు కంగారుగా ఇంకో పిల్లడిని ఏరి ఎత్తుకో బోగా నాకు ఆ వయసు చిన్న పిల్లలులేరు అన్నాడు మున సబుగారు నవ్వి.

చిత్తం. ఏ వయసులో ఉంటారండి సున్నూరు అన్నాడు అప్పారావు వినయం నటించి.

పాతికేళ్ళు.

అబ్బా. చాలా బరువుంటాడాండి? అన్నాడు అప్పారావు బిక్కమొహంతో.

నీకన్న ఫరవాలేదు. వెధవాయి తిండి సరిలేక అలా వున్నాడు కాని మా వంశంలో వాడే అర్భకుడు. అయినా నువ్విపుడు వాణ్నెత్తుకోడం నా కిష్టంలేదు. నేనొప్పుకున్నా వాడికి ఇష్టంవుండదు. వాడి పెళ్ళాం నవ్వుతుందని భయం అన్నారు మునసబుగారు పుసుక్కున నవ్వి.

అప్పారావు ఫెళ ఫెళ నవ్వేసి, విరగబడిలేచి, భలేవారండీ మీరు. జెంతసరసులూ చూట్టానికలా. వున్నారుకాని అని ముడేసుకుపోయాడు.

అది సర్లేగాని సుబ్బారావూ మూన్నాళ్ళక్రితమే పైకం జమచేస్తానన్నావూ ఇదేమన్నా బాగుందా అన్నారు మునసబుగారు.

మరేండి ఏంబావుంది, మహాఏడిసినట్టుంది. చాలా తప్పుకాదూ? అనూాకే నేను మా జతగాడికి చెబుతున్నా. ఒరేయ్ అవతల పెదమనిషితో మాటరోయ్ మరోటి కాదు రోయ్ డబ్బుఇచ్చి తీరాలి అని చీవాట్లేస్తున్నా. ఈ పూట తప్పకుండా యిస్తాన్నాడు. రాగానే మీకు ఫిరాయించేస్తా అన్నాడప్పారావు.

నేనేనా దాన్ని పాతరేసి దాచబొయ్యేదిలేదు. నువ్విలా ఇచ్చావో నేనలా మరొకరికి ఫిరాయించేస్తా మా పిల్లకిజతగాడికి పాపం అర్జెంటుగా కావాలిట అన్నాడు మునసబుగారు,

అప్పారావు గుండె ఠంగున ఆగిపోయింది. అంతలో అల్లంత దూరాన గుర్నాధాన్ని చూడగానే మళ్ళీ గబగబ కొట్టుకుంది.

సుబ్బారావూ - వాడేనోయ్ నూ పిల్లడూ అన్నారు మునసబుగారు.

చిత్తం. వాడే నూ జతగాడు అన్నాడు అప్పారావు.

హాల్లో అప్పారావ్ సారీ లేటైంది... అన్నాడు గుర్నాథం.

వేళకొచ్చావురా! అన్నాడు అప్పారావు.

నీ పేరు సుబ్బారావు గాదటోయ్ అన్నాడు మునసబుగారు అనుమానంగా.

అప్పారావు చెడ్డ బట్టాణీ నమిలిన వేదాంతిలా నవ్వి వాటీజినే నేమ్ సార్. పేరులోనేముంది? అన్నాడు వినయంగా.

* * *

పదినిమిషాలు కిందా మీదా పడ్డాక మునసబుగారు ఫెళ ఫెళ నవ్వి భలేవాడివయ్యా నీకు నిజంగా ఐదొందలూ పూరి కేయిచ్చినా తప్పులేదు అన్నారు.

చిత్తం మీదయ. గుర్నాథం! నువ్విస్తానన్న ఐదొందలిస్తే, మీనాన్నగారికి బాకీ తీర్చేస్తానుమరి. పెద్దమనిషితో మాటా మరోటా అన్నాడు.

ఇంక మళ్ళీవాడు ఇచ్చేదేముందిలే. వాడిచ్చినట్టే నముకో అన్నారు మునసబుగారు.

చిత్తం. అయితే పీడిచ్చింది మీకు నేనిచ్చినట్టను కోండి. ముందర మీబాకీ ఫయిసలయిందిగదా అమ్మయ్యా గుండెలమీద రాయిదిగినట్టయింది. అదేవిటో ఆ రాయిలేక పోతే నాకు నిద్రపట్టదు అన్నాడు అప్పారావు

రాస్కెల్ మానాన్నకే వేశావే టోపీ. నాకు తెలీకుండా మానాన్నదగ్గిర ఎలాపుచ్చుకున్నావూ అన్నాడు గుర్నాధం.

బావుంది నీకు తెలీకుండా నీదగ్గిర తీసుకోగాలేంది మీనాన్న దగ్గిర తీసుకోవడం విశేషమా. నీకసలు నిర్వాకం తెలీదు.

అలా చెప్పునాయనా అన్నారు మునసబుగారు.

చెబుతానండి. యింకా బోల్డు చెబుతాను. గాని మీరిందాక మాటన్నారు చూడండి...అదే ఐదొందలు ఊరికే ఇచ్చినా ఫర్వాలేదనలే? అది ఇచ్చేస్తే బాగుంటుంది. ఆడిన మాట తప్పనివారు పైగా శివాలయం, పైన అష్టదేవతలూ సాక్షులు. అనవసరంగా ఋణానపడి ఇదవడం, నాకు బాకీ ఉన్నారన్న బెంగతో రాత్రిళ్ళు నిద్రపట్టక ఇదవడం మంచిదికాదు, అన్నాడు అప్పారావు.

ఏడిశావు బోడి తెలివి నువ్వూను అనబోయాడు గుర్నాధం.

కుర్రాడు మంచిచమత్కారి ఉండాల్సినవాడు. అలాగేలేవయ్యా. నాలుగు రోజులుఆగు. చేతికి డబ్బు రాగానే నీ బాకీ జమకడతాను. అన్నారు మునసబుగారు.

చిత్తం నేను ఎల్లుండి ఊరికెళ్తున్నాను. ఈ లోగా ఇచ్చెయ్యండి. ఒకవేళ డబ్బు రెడీకాపోతే కరణంగారు నన్నేరు వదురు. వారితో చెప్పి సర్దమంటాను, తరువాత మీరూ నీరూ చూసుకుందురుగాని ......బై దిబై గుర్నాధం! మీ నాన్నగారు ఐదొందలు ఇవ్వగానే మళ్ళీ నీది నీకిస్తా గాని ఓ అర్ధణా డబ్బులిలా పారెయ్! శోషొస్తోంది సోడా తాగాలి...

*　　*　　*

అంటూ కథ ముగించాడు చీమల సింహాద్రి. కాబట్టి ఓ సుబ్బన్నా...

వారేవీరు లేక పరివర్తనము

అంటూ హఠాత్తుగా నేలమీద డేగనీడ కనబడేసరికి గబుక్కున పుట్టలో దూరిపోయాడు సింహాద్రి.

ఉత్తర క్షణంలో, ఇదేమిటీ! చీమకి డేగలం టే భయమేల అనుకుని, తన శరీరం చూసుకుని గతుక్కుమన్నాడు.

చుట్టూచూసి ఇంకా గతుక్కుమన్నాడు. హడలిపోయాడు. గజగజ వణికిపోయాడు.

మెల్లిగా పడగెత్తి పుట్ట అవతలికి తొంగిచూశాడు. డేగ, పైన చక్రాలు తిరిగి తిరిగి ఒక్కసారి రివ్వున, సుబ్బన్నా నాగలక్ష్మి అంతకుముందు దాగిన పొదమీదకు దిగి దాన్ని చీకాకుపరిచి వెతికి వెళ్లబోయి చిన్నబుచ్చుకొని, నవ్వుకొని అటూ ఇటూ చూసి ఎవరూ తన పరాభవం చూడలేదని ధైర్యం తెచ్చుకొని ఎగిరిపోయింది.

ఓ నిముషం తరువాత సుబ్బన్న, నాగలక్ష్మి పొద ఇవతలికి వచ్చారు.

పుట్టలోంచి సింహాద్రి, అతని బలగంకూడా బయట పడ్డారు బిలబిల్లాడుతూ.

ఇదేమిటీ వింత? అన్నాడు సుబ్బన్న.

సింహాద్రి చుట్టూచూశాడు తన కళ్ళను తనే నమ్మలేక. తనూ తన తోటి లక్షలాది చీమలూ పాములుగా మారిపోవడం జరిగింది.

అంతవరకు ఊహలు పొగరుగా బుసలుకొడుతున్న సుబ్బన్నా నాగలక్ష్మి నేలకంటుకొని ఉన్నారు. వాళ్ళిద్దరూ చీమలు అయిపోయారు.

నా కర్థం కాలేదు అన్నాడు సుబ్బన్న.

ఏముందీ ఆర్నెల్లు స్నేహంచేస్తే వారు వీరవుతారు అన్నాడు సింహాద్రి తనూపాగా నవ్వి. అతను తన పడగా అదీ చూసుకు మురిసిపోతున్నాడు.

ఇపుడు మీరంతా పాములు. ఇన్నిలక్షలమందికి ఒక పుట్ట ఎలాగా చాలదుగదా అంది నాగలక్ష్మి ఆశగా.

మీరిద్దరే చీమలు. మీకు ఇంత పెద్ద పుట్టెందుకు బావురుమంటూను, నిశిరాత్రివేళ మెలుకువస్తే ఝుమసుకుంటారుకూడాను అన్నాడు సింహాద్రి.

నాగలక్ష్మి ఓనిముషం ఆలోచించి, భయపడితే పడతాం గాని, ఆపుట్ట మాకు అప్పివ్వండి. ఎంతసేపు. ఇట్టె నిండుతుంది లెండి అంది

అప్పా? అన్నాడు సింహాద్రి పకపకనవ్వి మళ్ళీ అదేం మాట. ఇందాకేగా మీ ఆయన అప్పులు అడగరాదూ ఇవ్వరాదూ అని నీతికథలతో ప్రపంచతంత్రం బోధపరచానను కున్నాడు? మళ్ళీ ప్లేటు ఫిరాయిస్తారా?

జన్మలూ శాస్త్రాలూ ఫిరాయించగాలేంది ప్లేటుఫిరాయించడానికేముంది ...అదిగాక, ఆర్నెల్లు స్నేహమైతే వారు వీరవుతారని మీరే అన్నారుగా, మళ్ళీ బేరాలాడదాం ఆర్నెల్లపాటు. అప్పుడు మళ్ళీ మీరు మేమూ, మేము మీరూ, మోరు మారూ, మేరు మూరూ, మూము మేమూ, మూమె మేమే...

అఋణకిరణుడు నవ్వుకొని కొండచాటుకి పోగానే, ఋణకిరణుడు ఇవతలికివచ్చి ప్రతాపం వెలిగిస్తున్నాడు. మళ్ళీ అప్పిచ్చినవాడొచ్చి నుండిపడేవరకూ నిశ్చింత.

*  *  *

సూర్యుడు సముద్రుడిదగ్గిర అప్పు తీసుకుంటున్నాడు. ఆయనదగ్గరనుండి భూమి అప్పుతీసుకుంటోంది. దాన్ని సముద్రుడు వడేసుకుంటున్నాడు; మళ్ళీ పైవాడికి అప్పులిస్తున్నాడు.

ఋణభ్రమణం దాఋణంగా సాగిపోతోంది.

ఫలశ్రుతి

ఋణానందలహరి చదివినవారికి అప్పులుచేసే ట్రిక్కులు కొన్ని తెలియును. ఎన్నో స్ఫురించును. కాని ఒక చదివినవారిమీద ఇంకొక చదివినవారు ఇంకులో

తాము ట్రిక్కులనుకున్నవి ప్రయోగించటం గిట్టుబాటైనపని కాజాలదు. ఒక చదవనివాడు, ఇంకొక చదవనివాడిదగ్గిర ఈ ట్రిక్కులు తెలిసి ప్రయోగించే అవకాశం ఉండదుకనక చెప్పేదేంలేదు. ఒక చదవనివాడు ఒక చదివినవాడిదగ్గిర ప్రయోగించటమూ అంతే. కాబట్టి ఒక చదివినవాడు ఇంకో చదవనివాడిదగ్గర(ఉంటే)ప్రయోగించవచ్చు. కాని,అవి చెల్లుబడి కాకపోవచ్చు. అందువల్ల ఒక చదివినవాడు ఇంకో చదివినవాడితో చేరినపుడు దీన్నిగురించీ, ఇంకా ఇతర ఋణవాంఛ్యాలగురించీ కాసేపు మాటాడి ఛలోక్తులాడి, చివర్ని సూటిగా అడిగేస్తే మంచిది. అప్పు దొరకడం, దొరకక పోవడం వేరేసంగతి. ఇది చదివినవారు ఒక సుబ్బరమైన అప్పారావును కేకేసుకొచ్చి ఓ అయిదు రూపాయలు ఋణదక్షిణ ఇవ్వవలెను.

---

# సన్మానభంగం

కాంగ్రెసు రాజకీయాల్లా, సభ గందరగోళంగా ఉంది. ఇరవయ్యో శతాబ్ది జీవితంలా చీకాకుగా ఉంది. చేతకాని వాడి చేతిలో ఆర్కెస్ట్రా వాయిద్యాలలా ఈలలు, కేకలు తలో అపశ్రుతిలాగ పలుకుతున్నాయి. పలకరింపులూ, చీత్కారాలూ, స్వగతాలూ, జనాంతికాలూ, ఆహాలు, ఈహీలు, ఊహూంలు, (అప్పులడిగినవాళ్ళకి) ఓహోలు, హిహీలు, విమర్శలు, పరామర్శలు, హేళనలు, హేషలు, ఘీంకారాలు, కిచకిచలు, కిలకిలలు, రంకెలు, కేరింతలు, వగైరాలతో శబ్దం శతసహస్రముఖాలుగా ధ్వనించి ప్రతి ధ్వనించి క్రమంగా సరిహద్దు దాటి నిశ్శబ్దం స్థాయికి చేరు కుంటోంది. టాపు లేచిపోతే తాము కూలిపోతామన్న భయంకొద్దీ పంకాలు విపరీతమైన వేగంతో తిరుగుతూ శబ్దాన్ని తొక్కేస్తున్నాయి కిందకి. నిన్న సాయంకాలం సభ తాలూకు నిర్వాహకులు, నేటి సమావేశకర్తలు నిన్న పెట్టిన అల్లరిని తలుచుకొని అక్కసుకొద్దీ అల్లరిలో ఇవాళ బాకీ తీర్చేయడమేకాక అప్పుకూడా ఇస్తున్నారు. సభ సాయంకాలం ఐదున్నరకొట్టి ఆరున్నరకి సగమేనా కాక పోతుందా అన్న ధీమాతో వచ్చి మొదలైనా కాకపోవ డంతో చిన్నపుచ్చుకున్న పెద్దలు ఏడుకాగానే మండిపడడం మొదలెట్టారు. జన్మలో యెప్పుడూ ఇలా పెందరాళె తగల

ళ్ళేదు. ఇన్నాళ్ళకిక్కడ అవమానమయిందని తిడుతున్నారు. ఇండియన్ పంక్చువాలిటీ సార్, అని ఆ పెద్దలదృష్టిలో పడబోయిన సన్నకారుజనం పాతపాత విట్లతో సెటైర్ ప్రయోగిస్తున్నారు. మరికొందరు పాతసెటైర్లని 'రీట్రెడ్' చేయించుకొచ్చి సభంతా దొర్లిస్తున్నారు. పాటలూ, పద్యాలూ, కప్లెట్లూ వగయిరా లలితకళలుకూడ వర్ధిల్లుతున్నాయి.

విసుగెత్తిన ప్రయాణీకుడు ఈలవేస్తే, అది కండక్టరు ప్రశ్న అనుకొని బస్సు కదిపిన డ్రైవరులా ప్రార్థన పద్యాలాయన మూడోమాటు మైకుముందుకొచ్చి పద్యం మొదలెట్టె కరతాళధ్వనులమధ్య అర్ధాంతరంగా వెనక్కెళ్ళిపోయి తూ నా బొడ్డు అనుకుంటున్నాడు.

అంతా నాటకంలా ఉంది అన్నాడు ప్రస్తుతానికి మసిబారిన చిమ్నీలో కూర్చున్న ఒక తెలుగు దీపకళిక నిశితంగా.

హిది నాటకం హాలేనా అసలూ అన్నాడు సొట్టి వెలుగు కసుక్కున నవ్వి చటుక్కున తనముందున్న గడ్డపాయన వెనక తల దాచుకుంటూ.

* * *

అది నాటకంహాలే. పెద్దరకం సభలకి అది పుచ్చుకుంటూ ఉంటారు. అవతలివాడు ఏ మంత్రో అయితే మరీను. నాటకరంగం వెనకనే ఉన్న గ్రీన్‌రూమ్‌లో ఒక కాబోతున్న మంత్రిగారూ, సభ నిర్వాహణలో ఆపూట కొచ్చిన వక్తలూ చేరి చాలా ఖంగారు పడుతున్నారు.

ఎబ్బే లాభం లేదండీ. మన వెంత పూలతో కప్పేసినా కనిపిస్తాయి. ఎబ్బెట్టుగా ఉంటుంది అన్నాడు ఒక వక్త.

అందరూ సన్మానితుడికేసి జాలిగా, భయంగా చూశారు ఆయనపేరు సుబ్బన్నగారట. మహాభక్తుడు. వినయభూషణుడు. దారుణమైన వినయంట. పొరుగూరు నుంచి ఒక పెద్దమనిషీయన్నికడకు పంపి సన్మానం చేయించమని చీటీ రాసిచ్చాడు

కాబోతున్న మంత్రిగారికి పబ్లిసిటీ కాంపెయిన్ కార్యక్రమంలో ఒక సన్మానసభకూడాఉంది. సరే ఈయన వేళకొచ్చాడని ఆయన బలగం సన్మానానికీయన్ని బుక్ చేసి పబ్లిసిటీ యిచ్చారు. యింత విపరీతమైన వినమ్రుడు ఈయనేననీ అసలు లోకంలో వినయం నిండుకోడాని కారణం ఉన్నదంతా పోగై ఈయనగా కరడుకట్టుకు పోవడమే ననీ వెల్లడించారు: ఈ చమత్కారమే ప్రధానంగా మంత్రిగారి అధ్యక్షోపన్యాసం, ముఖ్యవక్త ఉపన్యాస భాగంగా ఏర్పాటు అయ్యాయి. తీరా సభ వేళకి వినయభూషణుడు సుబ్బన్నగారికి తనంత వినయశీలుడు లేడన్న గర్వం గంటకి బోలెడు చొప్పున పెరిగిపోయింది. ఇష్టాగోష్ఠి జరుగుతుండగానే కణతలపైన దురదవేసినట్టయి రెండుమూడుసార్లు తడుముకున్నాడు. తరవాత రెండుచిన్న బొడిపెలువచ్చాయి.

సెగడ్డలా? అన్నాడు కొంచెంలేటుగా వచ్చినాయన అవిచూసి. మీ అహంకారపు వేడిని కంట్రోలుచేసే థర్మాస్ బొడిపెలు అన్నాడొక ఆధునికకవి. సుబ్బన్న

గారు వినయంగానే నవ్వారుగానీ ఆ బొడిపెలు రెండూ హఠాత్తుగా బారెడు కొమ్ములుగా పెరిగి చివర సుడి తిరిగాయి. అంతా ఖంగారుపడ్డారు.

కాబోయే మంత్రిగారు ఇలాంటి సన్మానసభలో అధ్యక్షతకి సుతరామూ ఒప్పుకోలేదు.

ఈనగురించి మనకేం తెలీదు. వినయం ఉందన్న పరువుతప్ప. తీరా అది కాస్తా ఇలా తగలడింది. ఏంజూసి మాటాడమంటావయ్యా అన్నారు కా. మంత్రిగారు సుబ్బన్న కొమ్ములకేసి చూస్తూ.

ఎవరో తలుపు తీశారు. అవతల సభామందిరంలోంచి హాహాకారాలూ ఈలలూ హోరెత్తాయి.

కొమ్ములు కొట్టించేద్దాంలెండి అన్నాడు పెద్ద, తలుపు మూశాక.

మళ్ళీ మొలుస్తాయి.

అయినా నేను యింక ఈయనమీద ఉపన్యసించటం కల్ల అన్నాడు ఒక వక్త.

పోనీ యింకెవర్నైనా కేకేద్దామా?

ఇంకోడిమీద నేను చస్తే మాటాడను. ఆమాట కొస్తే మాటాళ్ళేను. ఈయనమీద ఫస్టాసు హ్యూమరస్ స్పీచ్ ప్రిపేరు చేసుకొచ్చాను అన్నాడు మరో వక్త.

దాని కేముందండీ, ఆ వచ్చేవాడిమీదే ప్రయోగించండి.

అంత బతిమాలడమేల? అయ్యగో వారున్నారు; నేనున్నాను. ఇద్దరం చాలం? ఇప్పటికే కాలాతీతం అయింది

కూడా. వక్తలు తక్కువైతేనే మంచిది అన్నారు శాస్త్రిల వారు.

ఆయనకి సన్మానితుడు ఒకడైనా సభ ఏదైనా ఫర వాలేదు. నన్నయ్య తగలేసిన పజ్జాలన్నీ ఎర్రన్న నెత్తిన రుద్దేస్తున్నారన్నది ఆయన జెండా. దానిమీద ఉపన్యసిస్తూ తన శత్రువుకి దైవసమానుడైన తిక్కన్నని ఉతికేసెయ్యడం ఆయన పరమార్థం. వేరుశనక్కాయ సభలోనైనాసరే ఆయన ఈ ఉపన్యాసాన్ని అన్వయించి మాటాడేసి, కాబట్టి వేరుశనగకు వాగన్లు త్వరగా సప్లయి చెయ్యాలి అని ముగించగలడు.

ఇది అందరికీ తెలుసు.

పోనీ ఈ ప్రశ్నను పట్టుకుని, ఈ కంకనశాస్త్రిలవారికి సన్మానం చేసేస్తే? అన్నాడు నిర్వాహకుడు.

ఒక ఉత్సాహి గబుక్కున తలుపుతీసి అవతల కెళ్ళాడు; కేకల కెరటం గదిని ఊపేసింది. వెళ్ళినవాడు వేదికమీది కెక్కి 'ఆర్యులారా! చిన్నమార్పు. సమ్మానితుడు సుబ్బన్నగారు కాదు. శాస్త్రిలవారు. కారణం నేలమీద నిలబడ్డం' అని టూకీగా ప్రకటించాడు.

*   *   *

కా. మంత్రిగారి కార్యదర్శి ఉత్సాహంతో ఎగిరి గంతు వేశాడు. ఔను. ఔనౌను. బెస్టు ఔను. మరోహఢైతే ఇంత రీసెర్చి చేసినందుకు పట్టపగ్గాలేకుండా ఉండేవాడు కాదనీ, నేల మీద నిల్చేవాడు గాడనీ, ఈయన నేలమీదే ఉండడం వల్ల మహా వినయశీలుడనీ కూడా బయటపడి పోతూందనీ —

అనకుండా శాస్త్రిలవారి పాదాలకేసి చూసిన ఆ ఉపసభవారంతా ఏకగ్రీవంతో కేరింత కొట్టారు.

శాస్త్రిలవారు నేలమీద లేరు. పాదాలు నేలకి బాగా ఆరంగుళాలఎత్తున ఉన్నాయి. శ్రీవారుకూడా సంస్కృతంలో బావురుమన్నారు. మందః కవియశః ప్రార్థీ అని చూశారు, గద్గదస్వరంతో, గర్వం అణిగిపోతుందేమోనన్న దురాశతో.

శాబోయ్ ఆ కాళిదాసు ఉూసెత్తకు. వాడలా అన్నాడుగాని వాడికి మహాలావు అహం అన్నాడాయన భావమదిది.

* * *

ఒక మహానటుడు తలుపు తీసుకొచ్చాడు. ఈలలతో కేకలతో గది అదిరిపోయింది.

ఛీ. ఎంత అహంకారం. ఏమిగర్వం. మాటవరసకి నువ్వూ గొప్పవాడవే లేవయ్యా అంటే ఔననుకుంటాడూ ఎంత గొప్పవాడైతేమటుకు, ఒప్పేసుకుంటాడూ అలాటి వాడికి సన్మానం చేస్తే మన గొప్పేమిటి? అన్నాడు మహానటుడు.

ఆయన పూర్వాశ్రమంలో కవి. ఒక తాత్కాలిక యుగకర్త. దరిమిలాను వినయం ఎక్కువై తాను కవిత్వానికి అనర్హుణ్నని, ఇన్నాళ్ళు కవిగా అభినయించ గలిగినట్టే ఈ మధ్యనే పనిగట్టి తనప్రజ్ఞ నటనలో ఉందని గ్రహించి ఇందులో జొరబడ్డాడు.

ఈ నాలుగుపాయింట్లూ జోడించి, మనం అవతల పోటీ దార్ని చితగ్గొట్టెయ్యొచ్చు. వారు దేశసేవకులుగా చేస్తున్న అభినయం అద్భుతమని అందువల్ల వారు రంగం ఫిరాయించి రాజకీయాల్నించి కళారాజకీయాలకు దయచెయ్యడం మంచి దని మీరు స్పీచికొట్టి వాణ్ణి చిత్తుచెయ్యొచ్చు. అందుచేత ఆ సన్మానం వీరికేచేస్తే బాగుంటుంది. నిమిషంలో రాయించు కొస్తాను. శ్రీకాలం హెడ్డింగుతో వస్తుంది రేప్పేపర్లో అన్నాడు కార్యదర్శి.

మీరంతా బలాత్కరిస్తే నాదేముంది అన్నాడు. నటుడు సవివరంగా పైకి చూడబోయి.

వలంటీరు తలుపుతీసుకు బయటికి వెళ్ళాడు. గది గోలెత్తిపోయింది. వలంటీరు మైకులోంచి మళ్ళీ మార్పు ప్రకటించాడు. 'ఆర్యులారా! ఇందాక చిన్న పొరపాటు. వక్తగారి పేరును పరాకున సన్మానితుడిదిగా ప్రకటించితిమి. ఇపుడు సన్మానం జరిగేది సుప్రసిద్ధ మహానటుడుగారికి. కారణం కళ్ళు నెత్తికెక్కక పోవడం' అన్నాడు ముక్తసరిగా.

* * *

పైకి చూడబోయిన మహానటుడు అదిరిపడి చేత్తో మొహం తడుముకున్నాడు. ఆయనకి ఆ గది పైభాగం అంతా బర్మాలో వెదురు పొదల అడివిలా కనబడింది. మళ్ళీ మొహం తడుముకున్నాడు. కళ్ళు రివాజైనచోట లేవు. బాగా పైకి జరిగి నెత్తిమీద, జులపాల మాటున ఉన్నాయి. రెప్పలార్చి కంగారుగా చూస్తున్నాడు భయంతో.

హా రామచంద్రా రక్షకా అన్నాడు శాస్త్రిలవారు.

హోరుమంటున్న చప్పుడుతో వలంటీరు లోనికివచ్చే సరికి అందరికి చెవులు గళ్ళు పడ్డాయి. 'ఏడున్నరయింది. జనంగోల కంట్రాక్టు నాటకాల ఆడియన్సు కన్న కనాకష్టంగా ఉంది' అన్నమాట ఎవరికీ వినబడలేదు. కాని ఒకనిమిషం తరవాత... అందరికీ తుమ్మెద ఝుంకారంలాటిది మంద్ర స్వరంలో శృతిపేయంగా వినబడింది. ఐదు, పది అనే మాటలు వినిపిస్తున్నాయి. చేతులు జేబుల్లోకి వెళ్ళొచ్చి, మంత్రముగ్ధులు అయినట్లుగా ఐదూ పదీ, అర్థా పర్థా ఇచ్చే స్తున్నాయి.

"చాలా థాంక్సు యింతమంది సహృదయులు ఒక్క చోట పోగడ్డం చూసి చాలాకాలం అయింది. మీ అప్పు లన్నీ నెల్లాళ్ళల్లో ఇచ్చేస్తాను," అన్నాడు అప్పారావు సర్వ జన మనోహరంగా నవ్వుతూ.

నల్లగా, పొట్టిగా, నవ్వుతూ ముద్దొస్తున్న ఆ మనిషిని అందరి కళ్ళు విస్ఫారం చూశాయి. అందరిలోనూ ఒకే మారు స్నేహం, ప్రేమ, గౌరవం పెల్లుబికాయి.

సభపెద్ద, పెద్దబ్బాయిగారి చిన్న అమ్మాయి ఋణ సుందరి హఠాత్తుగా తలుపుతోసుకు లోపలికొచ్చి అప్పా రావునిచూసి క్షణం సిగ్గుపడి, ఏరేనాన్నా పీరే. అంది. తరవాత ధైర్యం తెచ్చుకుని సీనియర్ నాన్నా. అప్పుల మీద ఇంత అథారిటీని నే నెక్కడా చూళ్ళేదు. ఎంత పోగ్గా అప్పుచేస్తాడు తెలుసా! ఎన్నో చెప్పాడు. నాన్నోయ్ మరేం.

మామ్మేటికి మనియార్డర్లాగానే అప్పుచేస్తాం చూడూ, అప్పుడేమో అస్సలు ఒక్క అరనిమిషం కూడా ఆగకూడదట. పోస్టుమాన్ ఇలా ఇచ్చి ఇవ్వగానే ఆ వేడిలో లాగేసుకుంటే అవతలి వాళ్ళకి నొప్పి తెలీదట. మనం ఇన్నాళ్ళూ రాంగ్ మెథడ్ రైటనుకున్నాం—

పెద్దబ్బాయిగారు అమ్మాయిమాట వినలేదు. అమాంతం అప్పారావుని కౌగలించుకొని "ధన్యుణ్ణి, ఇన్నాళ్ళు మీకీర్తి వినడమేగాని చూడ్డం పళ్ళేదు. ఇప్పుడు వెదకబోయిన ఋణదాతలా ఎదురయ్యారు. మీకన్న గొప్ప కళాకారుడు మాకు దొరకడు. మీకు కాస్సేపు సన్మానం చేసుకుంటాం. టైము వేస్టని తెలుసుకోండి, కాని కాదనకండి" అన్నాడు.

కా. మంత్రిగారు ఆలోచించకుండా తల తాటించి, ప్రాధేయపూర్వకంగా చూశారు.

కళ్ళజోడు వక్తకి ఒళ్ళు మండింది. ఏమిటిసాక్ ఏమిటి వీరి గొప్ప. అప్పు లెవరు చెయ్యరు? తెల్లారేచిందిలగాయతు అడ్డమైనవాడు చేస్తునేఉండే. లక్షసార్లు చేశాం. ఇంకా లక్షసార్లు చేస్తాం. అవసరం ఉండకా తప్పదు. అప్పు చెయ్యకా తప్పదు అన్నాడు తీవ్రంగా.

అప్పారావు చప్పట్లు కొట్టాడు. తల పైకెత్తాడు. విలాసంగా నవ్వాడు. జాలిగా చూశాడు.

నేను అవసరముంటేనే అప్పు చెయ్యాలనుకోను. పువ్వు లెందుకు పూస్తాయి? పిల్లలెందుకు నవ్వుతారు? నేను అందుకే అప్పుచేస్తాను—కోకిలలెందుకు కూస్తాయి ?...

నేను అందుకే—సెలయేళ్ళుంకుకు గలగలమంటాయి... అందుకే... కృష్ణశాస్త్రి గారెందుకు కవిత్వం చెబుతారు? —డిటో... రామాయణాం మళ్ళీ ఎందుకు రాస్తారు? సేమ్ ...చాలామంది ఎందుకు కవిత్వం చెప్పరు?

అలాగే జలదం ఎందుకు వర్షిస్తుంది? చంద్రుడు ఎందుకు వెన్నెల కాస్తాడు? మీవంటి సహృదయులు ఇప్పుడా ఐదురూపాయలు నాకెందుకు అప్పిస్తున్నారు? అందుకే...

చూశారా? సూర్యుడు సముద్రుడి దగ్గిర అప్పుతీసుకున్నట్టు, తేటిపూబోటినుంచి తేనె గ్రహించినట్టు, అమ్మాయిగారు పూలు వాసనచూసినట్లు, నేను సహజంగా, మృదువుగా, నొప్పి లేకుండా, తెలియకుండా, ఇలా ఋణ గ్రహణంచేస్తాను అన్నాడు. అని వినయంగా తలవంచుకొని వక్తచేతులోంచి అందుకున్న రూపాయినోట్లు ఐదూ ఉన్నాయా లేదా అని లెక్కచూసుకున్నాడు.

కా. మంత్రిగారుపొంగిపోయి, దగ్గిర్లోఉన్న దండ ఒకటి అప్పారావు మెడలో వేసి కావిలించుకున్నాడు.

శాస్త్రులవారి కళ్ళు చెమర్చాయి. 'ఋగ్వేదంలో కూడా ఋణాలగురించి ఉంది. ఆయొక్క ఉషస్సు అనేది, అప్పులనే చీకటి పారద్రోలే ఋణంలా భాసించిందని ఒక వేదర్షి వ్రాశారు. అన్నారాయన బొంగురు పోయిన గొంతుతో...

♦ ♦ ♦

"కదలండి కాలాతీత మయింది" అన్నారు మంత్రి గారు. అందరూ వేదిక పక్క, సైడుకర్టెన్ల వెనక నిలచారు, చెవులు రెండు చేతుల్తో మూసుకుని.

వలంటీరు మైకు వాల్యూము పెద్దది చేయించి, "ఈ మాటు సభ నిజంగా బిగినైపోతోంది" అని గావుకేక పెట్టాడు. హాలు దద్దరిలిపోయింది. అంతా నిశ్శబ్దం. అప్పారావు ఓ గులాబీ రేకుతీసి కిందపడేశాడు. ధన్ మని చప్పుడైంది.

ఇప్పుడు ఇందాక ప్రకటించిన ప్రకారం ఆమహా నటుడుగారికి కాక అప్పారావుగారికి సన్మానం జరుగుతుంది. అన్నాడు వలంటీరు. అప్పారావు తొంగిచూసి, సభలో నలుగురైదుగురు నిలబడ్డం గమనించి వలంటీర్ని వెనక్కి పిలిచాడు. ఐదునిమిషాలు గుసగుసలాడారు.

వలంటీరు తిరిగి మైకుముందుకు వెళ్లి "కాదు. నరసింహారావుగారికి సన్మానం" అన్నాడు. అప్పారావు పేరు విని వచ్చినవాళ్లు కూర్చున్నారు. గాని మరి పదిమంది లేచారు. అబ్బే, సుబ్బారావుగారికి అన్నాడు వలంటీరు. వాళ్ళు కూర్చున్నా ఇంకో ఆరుగురు లేచారు ఆశగా.

'కాదు వీరపరెడ్డిగారికి' అన్నాడు వలంటీరు.

ఇలా పొరబాట్లు సవరించకుంటూ, జలాలుద్దీన్, చమన్‌లాల్, హీరాచంద్ సితాసీ, జాన్ హారిసన్, వెంకటేశ్వర్లు, అనే పేర్లు ప్రకటించిచూసి చివరికి భద్రయ్య అన్నాడు. ఏంభద్రయ్య అని సభ అడిగింది. రాంభద్రయ్య అంటేకొందరూ, వీరభద్రయ్యంటే కొందరూ లేచారు.

సర్లెండి ఉత్తభద్రయ్య అన్నాడు వలంటీరు. సభ తటపటాయించింది. ఒకనిమిషంలో ఎవరోకానిభద్రయ్య నాకు బాకీ పాతికివ్వాలి. పత్తాలేడు అన్నారు. సభ గొల్లు మంది.

* * *

మంత్రిగారికి నీరసం వచ్చేసింది.

పోనీ ఓపని చేద్దాం. సన్మానితుడు కారణాంతరాల వల్ల రాలేదనీ, వారి తరఫున తరుణానికి తోటిపెళ్ళికొడుకులా ఒకర్ని కూచోబెడతామనీ ప్రకటన చేసి ఈయన్నే కూచోబెట్టి కాండ సాగించేద్దాం అన్నారు శాస్త్రిగారు. కాండేవిటండీ. ఇదేం తద్దినమా, మన శార్ధం అన్నాడు కా. మంత్రి.

అలాగే వుంది అన్నాడు ఒక వక్త.

ఋణాగ్రేసర చక్రవర్తికి సన్మానం చేస్తున్నపుడు ఆయన గైరుహాజరు కావడమే సహజమును, సముచితమును అన్నారు వెనకనించి ఇది చూస్తున్న ఒక పెద్దమనిషి.

అసలా పాయింటుమీద సభని పొట్ట చెక్కలయ్యేలా నవ్వించవచ్చు. అసలే విసుగేసి ఉన్నారు. వాళ్ళకి విట్లు వినోదం కావాలి అన్నాడు ఒక వక్త.

మిగతా వక్తలంతా నాలుగోసారి సన్మానం జరగబోతున్న ఆసామిగురించి ఉపన్యాసా లల్లేసుకుంటున్నారు చకచకా.

వాళ్ళ మొహం. వాళ్ళకేం తెలుసు. తెలిస్తే ఈ అఘోరింపులెందుకు. అయినా వాళ్ళక్కావలసింది చెప్పడానిక్కాదిది. మనక్కావలసింది చెప్పుకుందికి. నడవండి. స్టేజిమీదికి అన్నారు మంత్రిగారు.

మీ అసలు పేరేమిటిసార్! అన్నాడు కళ్ళజోడు వక్త అప్పారావుని చూసి.

వాటీజినే నేమ్. మీరు కొన్ని అడగరాదు. దేవుడి అసలుపేరేమిటి? అన్నాడు అప్పారావు.

ప్రక్కన బుట్టలో ఉన్న దండలు లావుపాటివి మూడు తీసుకుని మొహం కప్పడిపోయేలా వేసుకు స్టేజిమీద కెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు దూరం ఆలోచించి.

స్టేజిమీద కూర్చున్నవారిలో ఇద్దరికి దండలు తక్కువైనందువల్ల ఒక వలంటీరు అప్పారావుదగ్గరకొచ్చి మీరిన్ని మొయ్యలేరు అన్నట్టు మొహంపెట్టి బలవంతాన అవి లాక్కుని లోపలికి వెళ్ళి మళ్ళీ తెచ్చి మిగతా ఇద్దరికీ వేశాడు.

అధ్యక్షులుపరాకుతో, ఆరోజు నిజంగా సన్మానం జరగాల్సిన సుబ్బన్న తాలూకు వినయంగురించి స్పీచి ఆరంభించి నాలిక్కరచుకుని అప్పారావు కేసి చూసి వీరు అనేసరికి "వారు" అక్కడ లేరు.

తన మూడుహారాలలో రెండు పోగానే, ముఖారవిందాన్ని సభలో ఎవరో శ్రద్ధగా చూస్తున్నట్టు పసిగట్టి అప్పారావు తెర వెనుకకు వెళ్ళాడు అర్జంటు పనున్నట్టు.

పూలమాల లేపి లేవు. వెంటనే గ్రీన్ రూమ్ కెళ్ళి అక్కడ తన సంచి తీసుకొని వచ్చాడు. అందులోంచి పెద్ద బొగ్రమీసం తీసి అంటించుకొని తిరిగి స్టేజిమీదకు వచ్చి కూర్చున్నాడు.

కా. మంత్రిగారు, త్వరలో పెట్టబోయే పార్టీ గొప్ప తనం, అందులో పుట్టబోయే గ్రూపు విశిష్టత వివరించి, దాని షాడో కాబినెట్ లో మొదటిమంత్రిగిరీ ఎవరికి దక్కాలో చెబుతున్నారు.

అప్పారావుకి మళ్ళీ అనుమానం వచ్చింది. ఎవరో తనకేసి పరకాయించి చూస్తున్నట్టు. లేచి వింగులోకి పరుగెత్తి బవిరిగడ్డం తగిలించుకుని ముసిముసి నవ్వులు నవ్వుతూ వచ్చి కూర్చున్నాడు.

జనం గొల్లున నవ్వారు.

వెంటనే మంత్రిగారు తన పొరపాటు గ్రహించారు. ఆవేశంలో అవతల వాణ్ణి తిట్టడంతో ఆగక, తనకు తనే పబ్లికున పొగిడేసుకుంటున్నట్టు అప్పుడే ఆయనకు తెలిసింది. స్వపరభేదం కానందుకు చింతించి తరువాత వాక్యం ఆలోచిస్తూ అప్పారావు కేసి తిరిగి మీసంచూసి గతుక్కుమన్నారు. కాని అంతలోనే తళుక్కున ఆలోచన మెరిసింది. టైము ఎనిమిదిన్నర అవుతూంది. జనం వెళ్ళబోతున్నారు, ఇపుడు రాబందుల్లా కాసుకున్న వక్తగాళ్ళని వదిలేస్తే ఓ పట్టాన మైకుని వదల్రు. జిడ్డులా పట్టుకుంటారు. ఈ అప్పారావుగాడిమీద విట్లు వేస్తూ కూచుంటారు. అందుకని తన

పని తనే చూసుకోవాలి. చెప్పాల్సిన నాలుగూ తనే చెప్పాలి ఏదోవిధంగా...

ఒక్క నిముషం క్షమించాలి అంటూ ఆయన ఒక్క అంగలో స్టేజీమాటుకెళ్ళి అక్కడ అప్పారావు గడ్డం పెట్టుకుంటూ వదిలేసిన మీసం తగిలించుకుని కోటు విప్పేసి స్టేజిమీదకొచ్చేసి, ఇపుడు శ్రీ నరసింహారావుగారు మాట్లాడుతారు అని ప్రకటించి వెంటనే పెట్టబోయే పార్టీ, పుట్టబోయే గ్రూపు అందులో తన ఆశయం వివరించాడు.

ఆయన ముగించేసరికి – ఆరుగురేనా ఉపన్యసించాలి గాబట్టి ఎవరికీ ఐదునిముషాలకు మించి వ్యవధి ఇవ్వదల్చుకోలేదు——అప్పారావు హడావిడిగా వింగులోకివెళ్ళి గడ్డం వదిలేసి పెద్ద విక్రమార్కుడి మార్కుజుట్టు విగ్గుపెట్టుకుని చొక్కా విప్పేసి ఉత్తరీయం వేసుకుని వచ్చి కూర్చున్నాడు. పక్కనున్న వక్త మీకెన్నిరూపాలో? నిజరూపం ఏది అని అడగబోయి, దేవుణ్ణి తలుచుకున్నాడు.

తక్షణం 'నరసింహారావుగారు' వింగులోకి పరిగెత్తి, అప్పారావు వదిలేసినగడ్డం తగిలించుకొచ్చి ఇపుడు శ్రీ నరసయ్యగారుపన్యసిస్తారు అని ప్రకటించి పెట్టబోయేపార్టీ, పుట్టబోయే గ్రూపూ అందులో తన...

అప్పారావుకి స్థిమితం తగ్గిపోతోంది, ఇపుడు ఎవడో తనకేసి అనుమానంగా చూస్తున్నాడు. వెంటనే వింగులో కెళ్ళి స్టేజ మానేజర్ని బతిమాలుకొని కిరీటం, కత్తి, భుజకీర్తులున్న ధర్మరాజు చొక్కా, పంచె, చడావులు అడిగి పుచ్చుకుని అవి ధరించి స్టేజిమీదకొచ్చి వినయంగా నవ్వి కూర్చున్నాడు. పూలలో రేకులు లెక్కడుతూ.

'నరసయ్యగారు' స్పీచి ముగించగానే, వెళ్ళి, విగ్గు పెట్టుకొనివచ్చి, 'శ్రీ నయనప్ప మాట్లాడెదరు' అని ప్రకటించి మూడో లెక్చరు ఆరంభించాడు.

అప్పారావు ఈసారి రెండు నిముషాలలోనే లోపలికి పరుగెత్తి కీచకుడి కాస్ట్యూము వేసుకువచ్చాడు అప్పులాళ్ళు ఝడుసుకుంటారన్న ఆశతో.

'నయనప్ప'గారు లోపలికి పరుగెత్తి ధర్మరాజు వేషం వేసుకుని కత్తి ఝుళిపిస్తూ ఇపుడు శ్రీ జాన్ హారిసన్‌గారు మాట్లాడతారు అంటూ నాలుగో విడత ఆరంభించాడు.

అప్పారావుకి కీచకుడి డ్రెస్సు నప్పక ద్రౌపది వేషం వేసేలోగా సభలో సంరంభం, గంద్రగోళం చెలరేగింది.

పక్కవీధిలో జరుగుతున్న మీటింగులో, పెట్టబోయే పార్టీ (ఇదే) లోని పుట్టబోయే గ్రూపుకి నాయకుడిగా అక్కడి పెద్దమనిషినే ఏకగ్రీవంగా ఎన్నేసుకున్నారనీ, మినిష్ట్రీలో ఆ గ్రూపుకి రెప్రజెంటేషన్‌గా సీటిచ్చినపుడు ఆయనకే ఇవ్వాలని తీర్మానం పెట్టేశారనీ కబురు వచ్చింది. ఆ గ్రూపు ఊరేగింపుకూడా జరుగుతోంది. వాళ్ళు కాసేపు గుమ్మంలోనుంచి కేకలువేసి, ఇక్కడెలాగా జనం రెడీగా ఉన్నారు కాబట్టి ఇక్కడో సన్మానసభ చేయాలని నిశ్చయించారు.

'సన్మానం సన్మానం' అని ప్రకటన చేశారు. ముఖ్యులంతా గ్రీన్‌రూమ్‌లో జొరబడ్డారు. కాబోయిన మంత్రిగారు కూడా అందులో కలిసిపోయి ప్రముఖ పాత్ర వహించారు.

ఎవరికి సన్మానం చెయ్యాలన్న ప్రశ్నతో గదిలో

జనం వాదించుకుంటున్నారు. అవతల హాలులో జనం ఆలస్యాన్ని సహించలేక కేకలు ఈలలు వేస్తున్నారు.

కాబోయి మానేసిన మంత్రిగారికే కానందుకు సన్మానం చేస్తే అద్భుతంగా ఉంటుందనీ, తద్వారా పార్టీలో ఐకమత్యం సిమెంటులా గట్టిపడూరుకుంటుందనీ కా. మంత్రిగారి కార్యదర్శి సూచించాడు.

ఔనౌను. తాము ఉట్టి వెధవలన్న ముక్కను వినయంతో అంగీకరించి మంత్రిగిరిని త్యాగంచేసిన స్వార్థజీవి అన్నాడొక ఉద్రేకి.

కా. మంత్రిగారు సగర్వంగా వినయం నటించారు.

గదిలో అందరూ హాహాకారాలు చేశారు.

ఆయనకి నెత్తిమీద హఠాత్తుగా రెండు కొమ్ములు మొలిచాయి.

రెండోసారి అప్పులు నొల్లుకోడాని కొచ్చిన అప్పారావు ఆ గది తలుపు తెరిచి మళ్ళీ మొదలా అని నిర్ఘాంతపోయి తలుపలాగే వదిలేశాడు. ఇవతలగదిలో ఈ అఘాయిత్యానికి చెలరేగిన హాహాకారాలు కలిసి హోరెత్తిపోయేసరికి 'ఆ భవసభువనం' దద్దరిల్లిపోయింది.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరి

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B110 |
| పుస్తకం పేరు | బుడావంద లహరి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 133 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | S. Lakshmi |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |